# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

శ్రీ శోకా వెంకటరామానుజులు నాయుడుగారు రచించినది.

తెనుగులో, శ్రీమద్భగవద్గీతకు ఇంత చక్కని మహాభాష్యం మరొకటి లేదు. శ్రీ నాయుడుగారు భగవద్గీత అంతా చిరకాలం పారాయణ చేసీ, మననం చేసీ, మథించీ తాము తెలుసుకున్న గూఢార్థాలన్నీ లోకశ్రేయస్సుకోరి యీగ్రంథంరూపంగా భద్రపరిచి మనకు ప్రసాదించారు. వారు ప్రతీ శ్లోకానికీ ముందు ప్రతిపదార్థం ఇచ్చారు. తరవాత ప్రశ్నోత్తరాల రూపంగానూ వివరణరూపంగానూ గూఢార్థాలన్నీ ఉల్లేఖించారు. ఈగ్రంథం పరిశీలించకుండా ఎవ్వరైనా సరే "మేము భగవద్గీత చదివాము" అనుకోడం సాహసం అనిపించుకుంటుంది. రాయల్సైజున 724 పేజీలూ, 16 పేజీల అవతారికా గల గొప్పగ్రంథం కాలికోబైండు చెయ్యబడ్డది. కాని వెలమాత్రం పరమసులభం 6-0-0

---

# శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు

సంపాదకులు — ఘృతస్థానం నరసింహభాగవతులవారు.

ఇందులో, మేళకర్త రాగాల వరసను 505 కీర్తనలూ, 19 పవ్వళింపు కీర్తనలూ వున్నాయి. ఘనరాగపంచకం కీర్తనలకుమాత్రం మొదట స్వరం చేర్చబడివుంది. తక్కిన కీర్తనలన్నీ మూలం మాత్రమే ముద్రించబడ్డాయి. కఠినపదాలకు అర్థమున్నూ తెలుపబడ్డది. 16 పేజీల శ్రీ త్యాగరాజస్వామి చరిత్ర గలదు. మొదట మేళకర్తరాగాల వరసనూ, చివర అకారాదిగానూ కీర్తనల సూచిక చేర్చబడ్డది. దళసరి కాగితాలు. చక్కని బైండు. వెల 5-0-0 మాత్రమే.

---

# మంగళహారతులు, శ్రీకృష్ణసేవ.

శ్రీమతి కొచ్చెర్లకోట వీరలక్ష్మమ్మగారు రచించినవి.

ఈ రెండు పుస్తకాల్లోనూ స్త్రీల కందుబాటుగా ఉండే శైలిలో చక్కని మాదిరులలో 150 పాటలకు తక్కువకాకుండా ఉన్నాయి. అన్నీ భక్తిరసం ఉట్టిపడేవీ, శ్రీరామ, శ్రీకృష్ణుల సేవను తెలియచేసేవీని. దేనికదే వెల 1-0-0

---

మా పుస్తకములు పేరుపడ్డ అన్ని బుక్‌షాపులలోను ఈ ధరలకు దొరుకును.

(సరస్వతీ గ్రంథమంజరి)

# అంతఃపురము

## రెండవ భాగము

(నైనాల్లు)

మొసలికంటి సంజీవరావుపంతులు

"బక్సారు యుద్ధము," "మొగ్గలాయీదర్బారు" గ్రంథకర్త

రు 1/-

సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# DEDICATION

TO

*My Kinsman, Friend and Admirer,*

**Late Mosalikanty Kameswararao Pantulu,**

Joint Proprietor, Allipuram Estate,

VIZAGAPATAM

## ౧౬

ఐ ప వ కె ఫ.

సా౹కథ 1483 నాఁటిది. ప్రసిద్ధపురుషుండగు రెండవ మహమ్మదు సుల్తాను మరణించినంతనే యతనికుమారులిద్దరు సామ్రాజ్య సంపాదనార్థము యుద్ధసన్నద్ధులైరి. జ్యేష్ఠుండగు బైజీదుయుద్ధమున జయమంది సింహాసనాసీనుఁడాయెను. రెండవ రాజకుమారుఁడగు జెమీము ఓటుపడి 'రోడ్సు' నగరమునకుఁ బారెను. నిజసోదరుఁడొనరించు కుతంత్రములకుఁ దాళఁజాలక, జెమీము ఆ నగరమునుండి ఇటలీ దేశమునకును, మార్గమధ్యమునఁ బలుబాధ లనుభవించి యనంతరము ఫ్రాన్సుదేశమునకునుఁ బోలెను, తుదకు 'శానేజ్' యను దుర్గమున బంధితుఁడాయెను.

జెమీము రాకుమారుఁ డిరువదినాలు గేండ్ల యువకుఁడు. వాని నీలల విసిల నయనములును, కపిలవర్ణ విరాజిత దీర్ఘశిరోజములును, మనోహార మందహాసమును, విచారాక్రాంత వదనమును ఆతనిఁజూచువారి హృదయము నాకర్షింపఁజాలియుండెను. నిజదేశాచార విరుద్ధముగ గడ్డము నిడనాడి క్రైస్తవ నాగరిక జనోచితవస్త్రధారణ మొనరించు నా రాజకుమారుఁడు భయంకర వీరుఁడగు మాసాన్మను వంశజునివలెఁ దోఁపక, 'ప్యారిసు' నగర నివాసియగు నొక కులీనునివలె నీటుగఁ గాన్పించుచుండెను.

మోటుజనులకేమిక్రియు నాగరకులకేమిక్రియు మానసము కూడఁగనిగింపఁజాలు గాని కవిత్వకళలు జెమీమున కత్యంత ప్రియతమములై యుండెను. హాస్యరేఖలుకల వానిస్వభావముకూడ సరసముగ, సరళముగ మనోరంజకముగనుండెను. ఆతనితోడి ప్రసంగము కడు

నానందదాయకముగ నుండెను. శిల్పచిత్రలేఖనములందును నాతఁడు ప్రవీణుఁడై యుండెను. మహమ్మదీయ జనసామాన్య మూఢవిశ్వాసముల నెఱుంగనివాఁడుకూడ నగుటచే నారాజకుమారుఁడు మఱియు ప్రశంసనీయుఁడై యుండెను.

శానేజీ దుర్గాధిపతి అపత్నీకుఁడు. అతనికిఁ బదునాఱేండ్ల ప్రాయపుఁ బుత్రిక యుండెను.

'హెలీనా' యను నామధేయముగల ఆ కన్నియ అత్యంతసౌందర్యవతియగుటచే నా ప్రాంతమునందలి బలాధికార సంపన్నులగు జమీందారులందఱు మోహపరవశులై యామెను వివాహమాడ నాసించి యుండిరి. అందు 'ఆల్బర్టు' అను ప్రభువు యువకుఁడు, సద్వంశుఁడు అమిత ధనవంతుఁడు అనంత భూసంపన్నుఁడు నగుటచేఁదన తనయ నాతని కొసంగవలయునని హెలీనా జనకుఁడు నిశ్చయించెను. కాని, ఆమె హృదయాభిప్రాయము వేఱుగనుండెను. ఆల్బర్టు ధనాధికార బల సమేతుఁడయ్యు, మధుపానాది దుర్వ్యసనలోలుఁడగుటచే హెలీనా హృదయము నాకర్షింపఁజాలకపోయెను. సకల సద్గుణ ఖనియగు నా కన్నియ అట్టి గుణరహితు నెట్లు ప్రేమించును?

మనోహరాకారుఁడు, సచ్ఛీలుఁడు, అఖిల కళాకోవిదుఁడునగు జిజీము రాకుమారుఁడు హెలీనాను గాంచినంతనే మోహపరవశుఁడాయెను. ఆ సుందరియును జిజీమునుగాంచి నిజహృదయ సమర్పణ మొనరించెను. ఆయువతీ యువకు లనూన రూపవైభవ విభ్రాజితులై, అగణిత సుగుణగణ విరాజమానులై, పరస్పరము తగియుండుటచే దృఢతమప్రేమానుబద్ధులగుట సహజముగదా. దుర్గాధిపతి జిజీము నత్యంత గౌరవాభిమానములతో నరయుచుండెను. రాజకుమారుఁడు బంద్యావలెఁగాక, ప్రభుకుటుంబములోనివానివలెఁ గడుచనవుగఁ గలసి మెలసి తిరుగుచుండెను. భార్యారహితుఁడగునా దుర్గాధీశుఁడు నిజమిత్ర

సందర్శనార్థము తేఖుచుగా నిటునటు బోవుచుండుటచే, నా యువతీ యువకుల ప్రణయము ప్రవర్ధిల్లుటకు వలయు నవకాశ మలవడుచుండెను.

సెలీనా రాజకుమారుల ప్రణయము నిష్కళంకమై, పవిత్రవంతమై కడు బ్రశంసనీయమై యుండెను. తమ పరస్పరాను రాగము గుణించివారు తొలుదొల్త బరస్పరము ప్రశంసించికొనలేదు. పరస్పర మృదుల వీక్షణములను ప్రణయ పరిపూర్ణజల సహాజేతర ప్రవర్తనమునందును వారి హృదయ పరివర్తనము ప్రతిబింబితమగుచుండెను. కాని దుర్గాధిపతిమాత్ర మావిషయ మెఱుంగఁడు. ప్రణయినీ ప్రణయులకు సహజగుణమై యొప్పు భయముచే వారాతని సముఖమునఁగడు మెలఁకువగ మెలంగుచుండుటచేతనో, లేక, తన పుత్రిక అన్యమనస్థునేల ప్రేమించుననెడు నిబ్బరముచేతనో గాని, దుర్గాధిపతికి అనుమానమైన నంకురింపలేదు.

జిజీషు రాకుమారుఁడరుదెంచి రెండుమాసములాయెను. ఒకనాఁడు, దుర్గాధిపతి తన తనయను రావించి యిట్లులనెను.—

"కుమారీ! మన ఆల్బర్టుప్రభువునకు నేఁడు సాయంకాలము గొప్పవిందుచేయఁదలచితిని. ఇతర జమీందారులనుగూడ నాహ్వానించితిని. ఆల్బర్టునకు నిన్నియఁ దలఁచితినని యెఱుఁగి యేయున్నావు. శీఘ్రముగ నే మీ వివాహము వైభవముగఁ గాఁగలదు. నేఁడు నీవు సముచిత వస్త్రధారణ మొనరించి సిద్ధముగ నుండవలయు."

సెలీనా హృదయము కంపించెను. ఆకన్నియ దీనాననయై, కరములుజోడించి, మోఁకరించి మనంత దుఃఖాతిరేకమున నిట్లులనెను—

"తండ్రీ! నిన్నువిడి పోఁజాలను. జన్మస్థానమై, బాల్య విహారరంగమై, కడుంగడు స్మరణీయమై యొప్పు నీగృహమును విడఁ జాలను."

"బిడ్డా! అవివేకమున నిట్లులాడెదవు. వివాహమాడి నీగృహమునకుఁబోకుండ, శాశ్వతముగ నిందుండఁజాలవు."

"జనకా! అల్పబుద్ధిని వివాహమాడవలయు నని యూహింపకుము. మాయభిరుచులు పరస్పరము కడు విరుద్ధములు.—"

"భార్యాభర్తల రుచు లనతికాలమున నొక్కటి యగును."

"తండ్రీ! ఆ ప్రభువు నాకుఁ బ్రేమాస్పదుఁడు కాఁడు." అని వెక్కి-యేడ్చు తనబిడ్డను వారించి, దుర్గాధిపతి యిట్లనెను.—

"ప్రేమించి వివాహమాడుట కేవలము కథలలోని విషయము. కాని, వివాహానంతరము ప్రేమ ప్రభవించుటయే సామాన్య విషయమని గ్రహింపుము.—"

"తండ్రీ! ఈయల్పబుద్ధితోడి వివాహము ప్రేమజనకము కానేరదు."

మానసముద్రేకించిన కారణమున నా తెఱంగున నిశ్చలస్వరంబున నోలీనా విస్పష్టముగఁ బలుక, జనకుఁ డిట్లనెను.—

"చాలు, చాలు! ఇట్టి వృథాభయంబులవలదు. కుమారీ! నేను వృద్ధుడనైతి. చిరకాలము మనఁజాలను. మృత్యువు ప్రాపించవచ్చుచున్న నీకుఁదగు వరు నరసినఁగాని నాజన్మము సార్థకము కానేరదు. అనంతరము నిశ్చింతతో మనఁగలను. సౌందర్య ధనస్థైర్య సమన్వితుఁడగు అల్పబుద్ధి మనకన్ని విధముల వాంఛనీయుఁడు."

"తండ్రీ! మఱలఁ బ్రార్థించెదను. మనసులేని పురుషునకు నన్నుఁ గట్టిపెట్టుట పాడికాదు. దాన నీపుత్రికి సౌఖ్యమునకు వెలియగుటయే గాక, నిరంతర దుఃఖార్ణవనిమగ్న యగును—అల్పబుద్ధిపై నాకుఁ బ్రేమ లేదు—నేను వాని నెన్నఁడు ప్రేమింపఁజాలను—నా హృదయమునకు విరుద్ధములగు వైవాహికసమయము లానరింపఁజాలను.—"

"కుమారీ! బాలికవగుటచే నింకను మేలుంగీడు నెఱుఁగలే-దవు. ముగ్ధయువతీ హృదయము నే నెఱుంగనిదికాదు. ఇట్టులే నీ-రీతి భయసంభ్రమాకులంబై యుండును. నాబిడ్డ సౌఖ్య మరయు విధము నే నెఱుంగుదును. నేఁజెప్పు విధంబున మెలంగుదేని, అధిక

కాలమున నీవే నన్నుఁ గొనియాడెదవు. కావున, సాయంకాలపు విందునకు సిద్ధముగ నుండుము.”

అట్లు పలికిన వృద్ధజనకుఁడు వేఱొక కార్యమునుమీఁద నేఁగెను. హెలీనా తన హృదయమునఁ బొంగు విషాదము సహింపఁజాలక, మనసార నేడ్చుటకై తన మందిరమునకుఁ బోయెను.

తురుష్క రాజకుమారుఁడగు జిజీమునకొఱకు ప్రత్యేక మందిర మమరియుండెను. తన సహాయములు కేకొలఁదియు లేకున్నను, అతఁ డామందిరము మాత్రము వీడరాదు. ఈప్రతిబంధక మొక్కటియే అతని యస్వతంత్రావస్థకు సాక్షీభూతమై యుండెను. హెలీనా మందిర మద్దానికంటియే యుండెను. జిజీము తన మందిరపు డాబాపై విహరించుచుండెను. దురంత దుఃఖానల తప్తయగు హెలీనా యాతనిఁ గాంచినంతనే, ప్రకంపిత హృదయయై, అనిర్వచనీయోత్సాహ ప్రోత్సాహితయై అప్రయత్నముగా రాజకుమారుని చెంతకుఁ బోయెను. వారి ప్రసంగము సామాన్యముగనే ప్రారంభమాయెను. కాని, హెలీనా ఉత్సాహరహితయై, విషాదాక్రాంతవదనయై, ఆందోళితచిత్తయై యుండెనని కొంత తడవైన పిమ్మట గనిపెట్టి, రాజకుమారుఁ డిట్టులనెను.

“సుందరాంగీ! నీమానస మేలకో దుఃఖానలతప్తయై తోఁచెడిని. కారణ మరయఁదగునా? ఏకష్టమెఱుంగక సుఖజీవన మొనరించు నీకు ఘటిల్లిన విఘాత మేమి?”

జలజల రాలు బాష్పబిందువులను బోఁద్రోచి హెలీనా యిట్టు లనెను—

“ఆర్యా! ఏమి చెప్పుదు? నాసౌఖ్యమరయు మహనీయుని వల్లనే నాకీదురవస్థ ప్రాపించెను.”

“నీ జనకుఁడు కావలయు!”

“రాజా! నిశ్చయము. అల్లాస్ ప్రభువును [illegible] మహారాజ [illegible] రాజనందనుఁడు శాసించెను!”

పిమ్మటనంతట [illegible] పలుకులు విని [illegible], జీవిత ప్రాణస్నేహి, [illegible] ప్రియురాలితో [illegible] ఉద్విగ్న స్వరమున నిట్లనెను—

“అల్లాస్‌తో [illegible] వివాహము! వలదు! సెంలీనా! వలదు—వలదు!”

సెంలీనా వదనమండలము సుందర సంధ్యారుణ భాసురంబాయెను. తదావేశమున దనహస్తము నక్కునఁజేర్చి రాజకుమారుని వారింప నేరక ఆకాంక్ష భయాతురవీక్షణయై రాజకుమారునిఁ దిలకించెను. ప్రియప్రపూర్ణ వీక్షణముల నాతఁడును దిలకించి యిట్లనెను—

“సెంలీనా! ఈవివాహము వలదు. ప్రియతమా! నా జీవిత సౌఖ్యము నీపై నాధారపడియున్నది. నిన్ను వీడి మనఁజాలను. సుందరీ! నా హృదయము నీయధీనమై యున్నది. అనంతమై, అవిరళమై, అనివార్యమై, వర్ణనాతీతమై యొప్పు ప్రేమానుబంధిత హృదయముతో నిన్నుఁ బ్రేమించువాఁడను. తరుణీ! నీకతంబునఁ బ్రబలిన వృథతమ మోహమును నీవ యంతరింపఁజేసి ఈయభాగ్యుని నిరంతర గభీర దుఃఖార్ణవ నిర్మగ్ను నొనరింపకుము. సుందరీ! ఏమందువు?”

హృదయము తడబడ, నవ్యక్త మధురస్వరంబున నాకన్నియ యిట్టులనెను—

“రాజా! భవదీయ ప్రబలోద్విగ్న హృదయాభిప్రాయ మనివార్యము—”

“హా! ధన్యుఁడను! నీవౌదాసీన్యము వహింపకుండుట నాభాగ్యము. అఖండ సామ్రాజ్యాధిపత్యము వహింపవలసిన నేను దురంత దౌర్భాగ్యము కారణమున భగ్నమనోరథుఁడనై నిలిచిన తావున నిలువఁ

"రాజా! నిక్కము. అల్బర్టు ప్రభువును బరిణయమాడ వలయునని నా జనకుఁడు శాసించెను!"

పిడుగువంటి యామాటనస్పష్టపుఁ బలుకులు వినఁబడినంతనే, జీవము ప్రయాణ్యపడి, నాశికబంధితా ప్రియురాలి కోమల హస్తము పట్టుకొనే ఉద్విగ్న స్వరమున నిట్టులనెను—

"అల్బర్టుతో వివాహమా! వలదు! హెలీనా! వలదు—వలదు!"

హెలీనా వదనమండలము సుందర సంధ్యారుణ భాసురంబాయెను. తదావేశమునఁ దనహస్తము నక్కుననొత్తు రాకుమారుని వారింప నేరక ఆకాంత భయాతురవీక్షణయై రాజకుమారునిఁ దిలకించెను. ప్రణయప్రపూర్ణ వీక్షణముల నాతఁడామెను దిలకించి యిట్టులనెను—

"హెలీనా! ఈవివాహము వలదు. ప్రియతమా! నా జీవిత సౌఖ్యము నీపై నాధారపడియున్నది. నిన్ను వీడి మనఁజాలను. సుందరీ! నా హృదయము నీయధీనమై యున్నది. అనంతమై, అవిరళమై, అనివార్యమై, వర్ణనాతీతమై యొప్పు ప్రేమానుబంధిత హృదయముతో నిన్నుఁ బ్రేమించువాఁడను. తరుణీ! నీకతంబునఁ బ్రవర్ధిల్లిన దృఢతమ మోహమును నీవ యంతరింపఁజేసి ఈయభాగ్యుని నిరంతర గభీర దుఃఖార్ణవ నిమగ్నుని నొనరింపకుము. సుందరీ! ఏమందువు?"

హృదయము తడబడ, నవ్యక్త మధురస్వరంబున నాకన్నియ యిట్టులనెను—

"రాజా! భవదీయ ప్రబలోద్విగ్న హృదయాభిప్రాయ మనివార్యము—"

"హా! ధన్యుఁడను! నీవౌదాసీన్యము వహింపకుండుట నాభాగ్యము. అఖండ సామ్రాజ్యాధిపత్యము వహింపవలసిన నేను దురంత దౌర్భాగ్యము కారణమున భగ్నమనోరథుఁడనై నిలిచిన త్రోవను నిలువఁ

జాలక, ఎందును దాఁగికొన నెలవు గానక, పడరాని బాధలు పడి తుద కీస్థలంబున కరుదెంచుచు,—నిన్ను గాంచి ధన్యుఁడనగుటకే కాఁజాలయు!"

"రాజకుమారా! రాజ్యసంపాదనార్థము ఘోరసంగ్రామము సాగించి రించితివే యుంటివి? పరాక్రమ సమన్వితుఁడగు నీ యుద్ధానుభవములు వినుటకు నా హృదయము తత్తరపడుచున్నది."

"సుందరీ! చెప్పెద నాలింపుము. యశోవంతుఁడగు మదీయ జనకుఁడు మహమ్మదు సుల్తాను కనుమూసినంతనే, వేర్వేరు రాష్ట్రములు పాలించు నాకును నా సోదరుఁడగు బైజీదునకును మా వజీరు వర్తమాన మంపెను. వజీరు మదీయ శ్రేయోభిలాషి యగుటచే నేనరుదెంచువఱకు సుల్తాను మరణము మఱుఁగుపఱుప వలయునని ఎంతయో ప్రయత్నించెను. కాని, ఈరహస్యము నెట్టులో జనీజరీలు గ్రహించి తిరుగఁబడి, వజీరును సంహరించి బైజీదును సింహాసనాసీను నొనరించిరి. నాకొఱకు బయలుదేఱిన వార్తాహరుఁడు మార్గమధ్యమున నిహతుఁడాయెను. ఆసియాఖండమునందలి తురుష్క రాష్ట్రములకెల్ల మేటినగరమగు 'బ్రూసా' పట్టణమున కల్ప సైన్యసమేతుఁడనై నే నంతలో నరుదెంచితిని. నన్ను వారింపఁగడంగిన బైజీదు యొక్క సేనాపతిని యుద్ధమున నోడించి నా సార్వభౌమత్వము ప్రకటించికొంటిని. ఆహా! ఇది మూఁడువారముల ముచ్చట. అంతలో బైజీదు సుల్తాను మహాసైన్యసమన్వితుఁడై స్వయముగా నాపై దండెత్తి యరుదెంచెను. అన్నదమ్ములకు యుద్ధము వలదనియు, ఆసియా రాష్ట్రాధిపత్యము నాకు విడిచి, యూరపునందలి సామ్రాజ్యము పూర్తిగఁ దా ననుభవింపవచ్చుననియు నేను మాయన్నకు వర్తమాన మంపితిని. బైజీదు నిరాకరించెను. యుద్ధమున నాతఁడే విజయుఁడగుటచే, నేనందు నిలువఁజాలక, ముందుగ 'సిరియా' కును, అనంత

రము 'కైరో' నగరమునకును బాఱితిని. నాకు నచటను సాహాయ్య
మంతయు లభించుటచే, సామ్రాజ్య సంపాదనార్థము మఱల యుద్ధ
సన్నద్ధుండ నైతి. బైజేజే మఱల స్వయముగా ననంతసేనావాహిను
లయితుండ్రై ప్రత్యక్షమాయెను. కొన్ని రంగముల జయించి కొన్ని
రంగముల నోటుపడి, తుదకు నాసైన్యమే నన్ను విడనాడుటచే
జేయునది లేక ఆత్మసంరక్షణార్థము క్రిందటి సంవత్సరము రోడ్సు
నగరమున కరుదెంచితిని. తన్నగర శాసకులగు క్రైస్తవవీరులు
నాపై జాలిగొని, నాకొఱకు నైరోపా రాజన్యులందఱును యుద్ధసన్న
ద్ధుల నొనరింతుమని అమితాభిమాన గౌరవోదార హృదయములతోఁ
బలికిరి. నేను గడు సంతసించి యుంటిని. కాని, నాసోదరుఁ డొసం
గిన లంచములచే వారి మనసు విఱిగెను. వారంతట, నాయునికి
తమ కపాయకరముగ నుండెనని పలికి, 'ఫ్రాన్సు' నృపాలు నాతిథ్య
ము నపేక్షింపనలయునని చెప్పిరి. గత్యంతరము లేక, నేనట్లు లాచరించి
తిని. కాని, విశ్వాసఘాతుకులగు రోడ్సువీరులు నన్ను ఫ్రాన్సు రాజ
ధానికిఁ జేర్పక, నా యనుచరులనుండి విడదీసి, మార్గమధ్యమున
నిందందు నిలిపి, తుద కీదుర్గమునఁ బ్రవేశపెట్టిరి. సుందరీ! మఱియు
దురంత దుఃఖభాజన చారిత్రము నెఱింగించితి—కరుణాయత్తచిత్తవై
నన్నాదరింపక ఉపేక్షింతువేని, ఇదివఱకే దుర్భరవ్యథా విహ్వలాయ
మైన నాహృదయము వ్రక్కలగును—సుందరీ! భరింపఁజాల!—
ఏమందువు?"

"ఆర్యా! నీ చరిత్ర కడుంగడు సంతాపకరము. నాహృదయము
నిక్కముగఁ గరుణార్ద్రమై యున్నది."

"కరుణార్ద్రమా! అదియేడ? నేను నిన్నుఁ బ్రేమింతును;—నీవు
నన్నేల ప్రేమింపరాదు?"

రుద్ధస్వరంబున సెలీనా యిట్లనెను—

ను; మన మతములు పరస్పరవిరుద్ధములు—మన ప్రార్థన లోకేశుని నాజనకుని మానసము కరగించుఁగాక—మన నేమి ప్రయోజనము? నామతము నేను విడఁజాలను—నీ మతము నీవును విడఁజాలవు.”

తురుష్కరాజకుమారుఁడు మోహాతిరేకమునఁ దన దేశమును, రాజ్యమును, మతమును సర్వము పరిత్యజింతునని పలుకఁ, సమందహాసందదీపితవదనయై హెలీనా యియ్యకొనెను. జజీముఁ డనే నిజబాహుపంజరబంధితకీరవాణి నవిరళముగా ముద్దాడెను. అనంతరము, తా మొండొరుల నెడఁబాయరాదనియు, చచ్చినఁ జావవలయునుగాని పరస్పరము విశ్వాసఘాతుకముగ మెలఁగరాదనియు ప్రమాణము లొనరించిరి. హెలీనా యంతఁ దన మందిరమునకుఁ బోయెను.

సాయంకాల మైనంతనే ప్రసిద్ధపురుషు లందఱు శానేజీభవనమున కరుదెంచిరి. వివిధాపూర్వవస్తుసంభరితమై, అమితవైభవసమన్వితమై ఆ మందిరము దర్శనీయమై యుండెను.

జజీము రాజకుమారుఁడు గూడ నాహూయమానుఁడై యేతెంచి శానేజీ ప్రభువుచెంత నాసీనుఁడాయెను. ప్రభువునకు రెండవప్రక్క ఆల్బర్టు సుఖోపవిష్టుఁ డాయెను. అతనిచెంతనే హెలీనా ఉత్సాహరహితయై వివర్ణవదనయై కూర్చుండెను. వివాహమాడఁదలంచి తనకుత్సాహాతిరేకమున నేమియో పలుకు ఆల్బర్టు మధురప్రణయంపుఁ బలుకు లామె వీనులఁ బడుటలేదు. అతఁడు కొంత తడవైన పిమ్మట నావిషయము గమనించి, ఆ సుందరాంగి హృదయ మన్యాక్రాంతమై యుండునని వితర్కించి, తదదృష్టవంతుఁడు జజీమే కావలయునని రయమున గ్రహించి, సహజముగ దురంతబాధితాత్ముఁడై, సుష్కతక్రోధకలుషితాంతరంగుఁడై, ప్రతిక్రియాదరచన సంసిద్ధుఁడై, రాజకుమారునిఁ గాంచి యిట్లనెను—

“ప్రసిద్ధుఁడగు నూస్మానువంశజునకుఁ గుశలమేగదా. మాదేశ

తప్పక శిక్షాపాత్రము. ఐనను, మీరు తీవ్రపడరాదు. ఇతఁడన్య దేశస్థుఁడు; మన దేశ సాంప్రదాయములు నెఱింగిన వాఁడు కాఁడు; మంచి ప్రసిద్ధ రాజవంశజుఁడు. కావున, మన మేకార్యము తీవ్రపడి చేయరాదు. ఈ జిజీము ప్రస్తుతము పలాయన మొనరింపకుండ నుండే భద్రపఱచి, మన యున్నత న్యాయస్థానమున కంపుదము."

అతిథులు చేయునది లేక తమ తమ యిండ్లకుఁ బోయిరి. జిజీము విగతాస్త్రుఁడై నిక్కముగఁ గారాగృహావాసివలెఁ బూర్తిగ నస్వతంత్రుఁడాయెను. ఏకాకియై నంతనే గత వృత్తాంతమంతయుఁ దలంపునకు వచ్చెను. తన యవివేక మప్పుడు తెల్లమాయెను. వేగిరపాటున తద్దేశాచార విరుద్ధముగ ఘోరకార్య మొనరించుటయే గాక, దాన నిజ ప్రియకాంతా వియోగము కూడఁ బ్రాపించునని యెంచి అతిఁ జింతయుఁ జింతించెను. ఉత్తుంగతరంగమాలికా సంకీర్ణ గభీర పారావారా మధ్యస్థక్షుద్ర నౌకపై నేకాకియై అసహాయుఁడై యుండు దురదృష్ట నావికుని చందమున నాతని యవస్థ ఉత్సాహరహితమై కడు దుస్సహమైయుండెను. జిజీము హృదయారాటమునకు వేఱొక కారణముండెను. అతఁడు నిక్కముగ సపత్నీకుఁడు కాఁడు. ఆల్బర్టు పలుకు లసత్యములు కావు. హెలీనానుఁ గాంచి మోహాతిరేకమున దన తొంటి వివాహము నాతఁడు మఱుఁగు పఱచెను. కాని ఆల్బర్టు కారణమున రహస్యము బట్ట బయలాయెను. హెలీనా ఏమనును!

రాత్రి రెండు జాములాయెను. ప్రదేశమంతయు గంభీర నిశ్శబ్దాధీనమైయుండెను. జిజీమురాజకుమారుఁడు నిద్ర యెఱుంగక, చిత్తశాంతి యెఱుంగక, వివిధతీవ్రాలోచన వేధితమానసుఁడై పంజరబంధిత మృగరాజువలె నిట్టట్టు తిరుగుచుండ, నాకస్మికముగ గోడయందలి పలక యొక్కటి చలించెను. రాజకుమారుఁడు భయసంభ్రమాకులుఁడై చూచుచుండగనే, తద్వివరమునుండి సమున్నతశరీరయగు

నొకకాంత ప్రవేశించెను— దుర్గాధిపతిపుత్రికయగు హేలీనాయే!

తోడనే జికీము నయంబున బోనీక ఆలింగన మొనరింపఁబోయెను. వానిని వారించి, హేలీనా యిట్టులనెను.—

"ఆర్యా! ఇట్టి రహస్య మార్గమున నీ తెఱంగున నగుపించుచో విపరీతముగఁ గాన్పింపవచ్చును. రాజకుమారా! వెట్టినై నీపలుకులు విశ్వసించి యవానందానంద సాగరనిర్మగ్ననై తిని. ఇప్పుడైన నిక్కమరయుట నైతిని. కాని నాయువివేకము తెల్లమాయెను. అహా! నాహృదయ నైర్మల్యము దైవమెఱుంగు. కేవల మవ్యాజానురాగ హృదయముతో నే తెంచితినని నీవిపుడు గ్రహింతువుగదా!"

కాని, మోహాంధుఁడై అన్యమెఱుంగని రాజకుమారుఁడా పలుకులు పాటింపఁజాలక, తా నొనరించిన సమయము మఱువరాదని ఉద్విగ్నదైన్య స్వరంబున బ్రతిమాలెను. ఆకన్నియ అత్యుత్తమ మానినీసహజగాంభీర్యము వహించి, జికీము చకితుఁడై ముగ్ధుఁడై చూచుచుండ, నిట్టులనెను.—

"రాజకుమారా! మన పూర్వాచారిత్రము తలంపరాదు. నేను కృతనిశ్చయనై యున్నదానను—నాసంకల్ప మమోఘము. కాని, ప్రస్తుత విషయము గమనింపుము. నేడు మహాపరాధ మొనరించితివి— అందులకు మరణమే శరణ్యము— వలదు!— ఖడ్గము సారింపఁ బ్రయత్నింపకుము—నీవిపుడు నిరాయుధుఁడవని యెఱుంగవా? గమనింపుము. నీయన్నకు నీమరణమే వాంఛనీయము. తదాజ్ఞానువర్తులగు రోడ్సు వీరులకుఁగూడ నీమరణము తప్పక అపేక్షణీయము. భవదవివేక ధూర్తప్రవర్తనముననే నీవైరులకు మంచి యవకాశ మొనఁగితివి. రేపు నీవు మరణశిక్షకుఁ బాల్పడుదువు. ఇట్టి యకాల మరణము దుస్సహంబగుటచే నిన్నుఁదప్పింప నమకట్టి యరుదెంచితిని. ఇచ్చట కనతిదూరమున నొకచిన్న కుటీరమున్నది.

అందు మద్భ్రాతృసమానుఁడొకఁడు రెండు జవనాశ్వములనాయత్తపఱచి సిద్ధ్రమై వేచియుండును. క్రైస్తవమతాధ్యక్షుఁడగు 'పోపు' యొక్క రాజ్యమునకు నిన్నాతఁడు చేర్పఁగలఁడు. కారణాంతరమున మీ యన్నపైఁ గినియు పోపు నుస్వాగతమొసంగుటయేగాక, నీకువలయు సాహాయ్యముగూడ నొసంగును. కావున, ఈకారయందొక్క నిమిషమైనఁదడయక పోవలయు, లెమ్ము!"

"హెలీనా! నేనెట్లు పోఁగలను? నాకతంబున నీవు నీజనకుని దురాగ్రహమునకు గుఱియగుదువుగదా"

"రాజకుమారా! అవిరళాశ్రుజల నిర్మగ్నయై ప్రార్థించు తన యను జనకుఁడు తప్పక మన్నించునని విశ్వసింతును.

"కాని, దయ్యములవలెఁ గావలియుండు భటులను గనుఁబ్రామి పాఱుటయెట్లు?"

"విందు సమయమునందలి మధుపాన మధికమగుటచే నాతండ్రి మేనుమఱచి నిద్రించుటఁగాంచి, ఈముద్రిక హరించి వచ్చితి. ఇఁక నిన్నెవ్వరు వారింపఁజాలరు. ఈ విషయము నాజనకుఁడెఱుంగు సరికి నీవు చాల దవ్వుననుందువు."

"హెలీనా! ఏమైనను, నిన్నువీడి పోఁజాలను. భయంకర మృత్యు నాలింగనమైనను సహింతుగాని, నిన్ను ఘోరవిపత్సాగరమున డించి పోఁజాలను. సుందరీ! పోఁజాలను!"

రాజకుమారుఁడాపగిది నుద్విగ్న స్వరంబునఁ బలుక, నమిత విచారకాతరస్వనమున హెలీనా ఇట్లులనెను.—

"ఆర్యా! దాన నాదురవస్థ మఱియు దుస్సహంబగును."

"హా! సుందరీ! మద్వియోగము నీకు దుస్సహమే!" అని వడి వడి నఱచుచు, తదవసరోత్సాహ తమకమునఁదన కట్టెదుటనున్న సుందరిని గాఢాలింగన మొనరించెను. కాని, వివిధాలోచనలచ్చే

గ్రాఁగు నాయబలామణి తద్బాహుబంధనమునుండి రయంబునఁ దొలంగెను. ఐనను, సుస్నిగ్ధ కపోలములు మనోహరసంధ్యారుణరాగమున దీపింప, ప్రవాళసన్నిభ కోమలాధరోష్టములు ప్రచలింప, నామానిని అవనతనయనయై మిన్నకుండుటఁగాంచి సంతసే ఆశా నిరాశాంతర భయంకరాంధకారంబునఁ బొరలాడు రాజకుమారుని మానసమున నొక్కయూహ మెఱసెను. అతఁడు తోడనే యిట్టు లనెను.—

"హెలీనా! నా యథార్థచారిత్రము నీకు విదితమాయెను. కాదనఁ జాలను. నాకు నిక్కముగ భార్యకలదు. మీదేశ సాంప్రదాయముల ననుసరించి నాతోడి పొందు నీకు దుస్సహంబని యెఱుంగుదు. ఐనను—నాయవినయ ప్రవర్తనము మఱచి యొక్క మనవి చెల్లింపుము—నన్ను బంధించు పాశము దైవికముగ విచ్ఛిన్నమగునేని— అప్పుడు మన—"

"అప్పుడు కావచ్చు—ఆహా!—"

"ధన్యుఁడను! సుందరీ, ధన్యుఁడను! ఎన్నటికైన నీపొందు ప్రాపించుఁగాన, ఆత్మసంరక్షణోపాయము తప్పక వాంఛింతును."

జిజీము తోడనే స్త్రీవేషము ధరించెను. వారిరువురు నారహస్య మార్గమునుండియే తద్విశాల మందిరమునుండి రయంబున వెలువడిరి. ఆమార్గమున భటులంతగనుండరు. ఉన్నవారైనను, హెలీనా ఇంతటి మాయోపాయమునకుఁ గడంగునని యెఱుంగని కారణంబున స్త్రీవేష ధారుఁడగు జిజీమును గాంచియు దమ ప్రభుపుత్రి బందుగురాలు కావలయునని భ్రమించి ఊరకుండిరి.

వారట్లు నిరపాయముగా సింహద్వారము సమీపించిరి. నిజహృదయాపహారిణియగు హెలీనాను గొంపోవలయునని జిజీము ప్రయత్నించెను. కాని, ఆ కైశోరి స్తవమానక్షతి నిరాకరించెను. రాజకుమారుని చెంత

సమానాకృతిగల రెండుముద్రికలుండెను. అందొకటి హెలీనాకొసంగి సమయమగునపుడు రెండవయుంగరము ప్రదర్శించువానివెంట రావల యునని ఆతఁడు కోరెను. ప్రభుపుత్రి సమ్మతించెను. అనంతర మాప్రణయినీ ప్రణయులు మనసార గాఢాలింగన మొనరించి ఒం డొరుల సెలవు గైకొనిరి.

అరణ్యమార్గముబట్టి కొంత దవ్వరిగినంతనే, హెలీనా సోదర సముఁడా కన్నియచెప్పినట్టులే గోచరించెను. రాజకుమారుఁడట స్త్రీవేషమువీడి, ధనవంతుఁడగు వాలికుని యాకృతి దాల్చెను. కాని కొంత దవ్వరిగిన పిదప నాహతభాగ్యుఁడు పట్టుపడి మగుడ బంధింపఁ బడెను.

ఆకాలముననే క్రైస్తవ నృపాలురు తురుష్క సార్వభౌమునిపై దండెత్తఁ గోరి, జిజీము సరయఁ బ్రయత్నించిరి. ఆతఁడు నాయ కత్వము వహించునేని, పరస్పరము గడు లాభకరముగ నుండెడిది. కాని, బైజీదు సుల్తానొసంగు నమితధనము గుడుచు రోడ్సువీరులు తద్రహస్యము వెల్లడింపకుండిరి. విశాల సామ్రాజ్యభార ధురంధు రుఁడై యఖండ భోగభాగ్యముల నోలలాడవలసిన జిజీము ఆ కారణ మున నాలుగైదు సంవత్సరములు స్వాతంత్ర్య విరహిత నికృష్టజీవన మొనరించెను. తుదకు, రోడ్సునగరాధిపతి ధనాశాపరుఁడై జిజీ మును పోపున కప్పగించెను. ఈవిషయ మెఱింగిన బైజీదుసుల్తాను తన తమ్ముని ఖర్చులన్నిఁ దానె భరించుటయె గాక, నిజ సోదర స్వాతంత్ర్య మరికట్టి తన కమితోపకార మొనరించిన పోపునకు గొప్ప బహుమాన మొసంగెను.

కొంతకాలమునకు ఆపోపు మరణింప, దుర్మార్గుఁడగు "అలగ్జాం డరు బోర్జియా" తదాధిపత్యము వహించెను. 1494 లో ఫ్రెంచి రాజు ప్రసిద్ధ వీరజన పరివృతుఁడై ఇటలీ దేశముపై దండెత్తెను.

గ్రాఁగు నాయబలామణి తద్బాహుబంధనమునుండి రయంబునఁ దొలంగెను. ఐనను, సుస్నిగ్ధ కపోలములు మనోహారసంధ్యారుణరాగమున దీపింప, ప్రవాళసన్నిభ కోమలాధరోష్ఠములు ప్రచలింప, నామానిని అవనతనయనయై మిన్నకుండుటఁగాంచి సంతనే ఆశా నిరాశాంతర భయంకరాంధకారంబునఁ బొరలాడు రాజకుమారుని మానసమున నొక్కయూహ మెఱసెను. అతఁడు తోడనే యిట్లు లనెను.—

“హెలీనా! నా యథార్థచారిత్రము నీకు విదితమాయెను. కాదనఁ జాలను. నాకు నిక్కముగ భార్యకలదు. మీ దేశ సాంప్రదాయముల ననుసరించి నాతోడి పొందు నీకు దుస్సహంబని యెఱుంగుదు. ఐనను—నాయవినయ ప్రవర్తనము మఱచి యొక్క మనవి చెల్లింపుము—నన్ను బంధించు పాశము దైవికముగ విచ్ఛిన్నమగు నేని—అపుడు మన—”

“అపుడు కావచ్చు—ఆహా!—”

“ధన్యుఁడను! సుందరీ, ధన్యుఁడను! ఎన్నటికైన నీపొందు ప్రాపించుఁగాన, ఆత్మసంరక్షణోపాయము తప్పక వాంఛింతును.”

జిజీము తోడనే స్త్రీవేషము ధరించెను. వారిరువురు నారహస్య మార్గమునుండియే తద్విశాల మందిరమునుండి రయంబున వెలువడిరి. ఆమార్గమున భటులంతగనుండరు. ఉన్నవారైనను, హెలీనాయింతటి మాయోపాయమునకుఁ గడంగునని యెఱుంగని కారణంబున స్త్రీవేష ధారుఁడగు జిజీమును గాంచియు దమ ప్రభుపుత్రి బందుగురాలు కావలయునని భ్రమించి ఊరకుండిరి.

వారట్లు నిరపాయముగా సింహద్వారము సమీపించిరి. నిజహృదయాపహారిణియగు హెలీనాను గొంపోవలయునని జిజీము ప్రయత్నించెను. కాని, ఆక్రైస్తవమానవతి నిరాకరించెను. రాజకుమారునిచెంత

సమానాకృతిగల రెండుముద్రికలుండెను. అందొకటి హెలీనాకొసంగి సమయమగునపుడు రెండవయుంగరము ప్రదర్శించువానివెంట రావల యునని ఆతఁడు కోరెను. ప్రభుపుత్రి సమ్మతించెను. అనంతర మా ప్రణయినీ ప్రణయులు మనసార గాఢాలింగన మొనరించి ఒం డొరుల సెలవు గైకొనిరి.

అరణ్యమార్గముబట్టి కొంత దవ్వరిగినంతనే, హెలీనా సోదర సముఁడా కన్నియచెప్పినట్టులే గోచరించెను. రాజకుమారుఁడట స్త్రీవేషమువీడి, ధనవంతుడగు హాలికుని యాకృతి దాల్చెను. కాని కొంత దవ్వరిగిన పిదప నాహతభాగ్యుఁడు పట్టుపడి మగుడ బంధింపఁ బడెను.

ఆకాలముననే క్రైస్తవ నృపాలురు తురుష్క సార్వభౌమునిపై దండెత్తఁ గోరి, జిజీము సరయఁ బ్రయత్నించిరి. ఆతఁడు నాయ కత్వము వహించునేని, పరస్పరము గడు లాభకరముగ నుండెడిది. కాని, బైజీదు సుల్తా నొసంగు నమితధనము గుడుచు రోడ్సువీరులు తద్రహస్యము వెల్లడింపకుండిరి. విశాల సామ్రాజ్యభార ధురంధు రుఁడై యఖండ భోగభాగ్యముల నోలలాడవలసిన జిజీము ఆ కారణ మున నాలుగైదు సంవత్సరములు స్వాతంత్ర్య విరహిత నికృష్టజీవన మొనరించెను. తుదకు, రోడ్సునగరాధిపతి ధనాశాపరుఁడై జిజీ మును పోపున కప్పగించెను. ఈవిషయ మెఱింగిన బైజీదుసుల్తాను తన తమ్ముని ఖర్చులనెల్లఁ దానె భరించుటయె గాక, నిజ సోదర స్వాతంత్ర్య మరికట్టి తన కమితోపకార మొనరించిన పోపునకు గొప్ప బహుమాన మొసంగెను.

కొంతకాలమునకు ఆపోపు మరణింప, దుర్మార్గుఁడగు "అలగ్జాం డరు బోర్జియా" తదాధిపత్యము వహించెను. 1494 లో ఫ్రెంచి రాజు ప్రసిద్ధ వీరజన పరివృతుఁడై ఇటలీ దేశముపై దండెత్తెను.

పోపగు బోర్జియా వైరి నెదిరించుటకు బలము చాలక సంధి నర్థించెను. జిజీముయొక్క విషాద చారిత్రము ఫ్రెంచి నృపాలునకుఁ దెలియవచ్చుటచే నాయుదారవంతుఁడు జాలిగొని, ఆ తురుష్క రాజకుమారునిఁ దన యధీన మొనరింపవలయునని విధించెను; పోపు సమ్మతించెను. కాని, విజయుని దిగ్విజయ మింకను బూర్తికాలేదు. ఆ కారణమున జిజీ యింకను గొంతకాల మందే నిలువవలసినవాఁ డాయెను. ఐనను, దురాత్ముఁడగు పోపువలన నాతని కెట్టి యపాయము వొరయకుండఁ దన సైనికవిభాగము నొండు ఫ్రెంచిరాజు కాఁపుంచెను.

పాపాత్ముఁడగు పోపు అంతమాత్రమున విరమింపక, బైజీదు సుల్తాను చెంతకుఁ దనదూత నంపెను. ఫ్రెంచిరాజు దూరదేశమున నుండునపుడే ఎట్టులో జిజీమును విగతజీవు నొనరించుట కాతఁ డొడఁబడెను: సుల్తాను ఆనందపరవశుఁడై యట్టి రాక్షసకృత్య మాచరించు పోపున కమూల్య బహుమానము లొసంగెద నని బాస చేసెను.

దుర్భరమగు పోపు నిర్బంధము సడలినంతనే జిజీము సంతోషించెను. ఆ సమయముననే ఈజిప్టుసందుండు దన భార్య మరణించెనని తెలియవచ్చెను. దాన నాతని యానందము ద్విగుణీకృతమాయెను. నిజహృదయాపహరణ మొనరించిన ఆ నవమోహనాంగిని—హెలీనాను ఇఁక వివాహమాడి నిరవధిక ప్రేమానంద తరంగ డోలికల నిరంతర ముయ్యాల లూగవచ్చునని భావించి, నమ్మిన బంటగు హుసేనును జీరి, తన ముద్రిక నొసంగి, తత్క్షణము శానేజీ దుర్గమునకుఁ బోయి యందుండు హెలీనాను గొనిరావలయునని నియోగించెను.

ఆల్బర్టు ప్రభువును సభామధ్యమున నాతెలంగున వధించి జిజీము పాఱి సుమారు పది సంవత్సరము లాయెను. దుర్గాధిపతి వయసు

మీఱిన కారణమున మరణించెను. శానేజీ దుర్గమును తద్వీపుల భాగ్యమంతయును హెలీనా యధీనమాయెను. ఏండ్లు గడచుకొలఁది నామె రూపవైభవము మఱియు మఱియు నధికమాయెను. జిజీము తన దూత నంపునరికి ఆ శీలవతి పరిపూర్ణయౌవన ప్రభావిభాసితయై నిరుపమాన సౌందర్యముతో నలరారుచుండెను. కాని, కాంతుఁడు లేని కాంత జీవనము దుర్భరము, నిరర్థకము గదా. హెలీనాకు నిజసౌందర్య భాగ్యవైభవములతోఁ బనియేమి? నిజ హృదయాప హారు వదన సందర్శనోత్సాహము దృఢతమ విశ్వాసబద్ధమగుటచే నాకాంత యింతకాలము సజీవముగా నుండెగాని, లేదేని, దుస్సహ వియోగానలంబున మ్రగ్గవలసినదే. ఏండ్లు నడచుచుండినను, ఆక్రైస్తవ మానిని నిరుత్సాహపడక, ఆశవీడక నిరీక్షించుచుండెను.

హసేనును గాంచినంతనే హెలీనా యనిర్వాచ్యానందము ననుభవించి, తన దుర్గరక్షణభార మొక విశ్వసనీయుఁడగు సేవకునిపైఁ బెట్టి, వలయు ప్రయాణసన్నాహములు సత్వర మొనరించి, ఏకపరిచారికా సాహాయ్యయై ప్రకంపిత హృదయయై హసేను ననుగమించెను.

హెలీనా గమ్యస్థానము చేరినంతనే, రాజకుమారుఁడు వ్యాధిగ్రస్తుఁ డాయెనని తెలియవచ్చెను. పిడుగువంటి యాదుర్వార్త విని ఆమె మ్రాన్పడియు నిట్టులనెను—“ఐన, సమయమున కరుదెంచితి. సముచిత పరిచర్య నేనె సలిపి మదీయ హృదయాధినాథున కారోగ్య మలవడఁజేయుదు.” హసేను మాఱాడఁజాలక, ఆనారీరత్నమును రాజకుమారుని శయ్యామందిరమునకుఁ గొంపోయెను.

కళావిహీనుఁడై, బలహీనుఁడై, శయ్యాగతుఁడై యసదవిధమునఁ బడియున్న జిజీమును గాంచినంతనే యవిరళాశ్రుధారార్ద్రకపోలయై, హెలీనా యిట్టు చింతించెను.—“ఆహా! కాలప్రభావమున నీ నవ మోహనాకారుఁ డెంతగ మాఱిపోయెను! దురంత హృదయ సంక్షో

భము, దుర్భర కారాగృహ జీవనమును ఈ మహానీయుని ఏఁబది సంవత్సరములు మీఱిన వృద్ధు నొనరించెనే! హా! విధీ! ఐననేమి? ఈ వదన మెట్టులున్నను, నాకుఁ బ్రేమాస్పదము, అనంత సంతస ప్రదము!"

రోగార్తుఁడైన జిజీము ముకుళిత నయనుఁడై యుండెను. హెలీనా యాతని శిరముచెంత నాసీనయై, అధిక విచారభరితస్వాంతయై, ఆపగిది చింతించుచుండ, రాజకుమారుఁడు కనువిచ్చెను. నిజహృద యేశ్వరీ సుందరవదన ముదయించినంతనే, జీవరహితమగు రాజ కుమారుని వదనము రయమున వికాసవంతమాయెను. అనంతర మా ప్రణయినీ ప్రణయులు పరస్పరము గాఢాలింగన మొనరించిరి. దాహార్తునిపగిది జిజీము నిజాదరసుధారస మెంత గ్రోలినను హెలీనా ఈసమయమున వారింపలేదు. చిరకాల ప్రవర్ధిత మోహావేశ మొకింత చల్లార, నిజచరణ యుగ్మముచెంత వినయ ప్రణయస్వరూప మున వ్రాలియున్న సుందరిని విస్ఫారితనయనంబుల నట్టె తిలకించుచు జిజీ యిట్టులనెను.—

"సుందరీ! ఎట్టకేలకుఁ గలసికొంటిమి! నీవు సమయభంగ మొన రింపవనియు, ఎన్నటికైన మనము కలసికొందుమనియు నిండనుక నాశించియుంటిని. నేటికి సఫలమాయెను!"

"రాజకుమారా! నేనును దృఢాశాబద్ధనై విశ్వాసపూరిత స్వాం తనై వేచియుంటిని. కాని! నీవు వ్యాధిగ్రస్తుఁడవైతివే! కడు బల హీనముగ నున్నవాఁడవు! ఆహా! ఎంతబాధ నొందితివో—"

ఇంకను నేమియో రుద్ధస్వరంబునఁ బల్కు నిజప్రియాంగనను వారించి, రాజకుమారుఁ డిట్టులనెను.—

"హెలీనా! నే నిన్నిదినంబులు పలువెతలఁ గుందితిని—అల్లా ఎఱుంగు! బంధితునకు వెలుంగును స్వాతంత్ర్యమునువలె నీయునికి

నాకెంతయు వాంఛనీయముగ నుండెను. సుందరీ! భవదీయ వదన చంద్రదయ ముదయించినంతనే నాహృదయ ముప్పొంగ నారంభించెను. డిందుపడిన మానసమునకుఁ జెప్పరాని యానందము ఉత్సాహమును అలవడెను."

"రాజకుమారా! నే నిఁక నీ చెంతనేయుండి, సంపూర్ణారోగ్య భాగ్యవంతుఁడ వగువఱకు నీకు వలయు సర్వోపచారము లొనరింతును."

"ప్రేయసీ! నీవంటి దయార్ద్రహృదయ నాకు దాదియైయుండ, నాకీ రుగ్నత భయకారణము కానేరదు—అచిరకాలమున హాయిగ నుందును. కాని, సుందరీ! ప్రకృతము మఱవరాదు. భవదీయాగమన కారణోద్భూత సంతోషము నాదుర్బలశరీరమునకు దుస్సహం బగును. నీ పరిచర్య ఈక్షణమునుండియు నారంభము కావలియును. సుందరీ! నాకై ప్రత్యేకముగ పోపు ప్రశస్తమగు సారాయి ఇప్పుడే పంపియుండెను. ఆ పాత్ర మయ్యదె! ఒకింత యొసంగుము."

తోడనే, హెలీనా లేచి కొండొక హేమకలశము గైకొని, పోపు పంపిన మధురసమునం దొకింత పోసి, తదాస్వాదనమునం దనహృదయేశుఁడు నేదదేఱునను నాసతో నాతని కందిచ్చెను. తత్కోమల కరపల్లవంబు నల్లన ముద్దాడి, సంతోషిత స్వాంతుఁడై, ఉత్సాహదీపితవదనుఁడై, మందహాస విరాజితాననుఁడై జిజీము మధువు గ్రోలెను.

ఎంత విపరీతము! ఎంత దారుణము! ఎంత దురదృష్టము! త్రావిన పాత్ర త్రావినంతనే నేలఁబడెను: రాజకుమారుఁడు తూలి సోఫాపైఁబడెను: నయనములు సహజచాంచల్యము దొఱంగి అట్టె నిలిచిపోయెను. పెదవులు విడివియే యుండెను గాని ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేవు!

ఆ దారుణ వైపరీత్యము గాంచి హెలీనా భయభ్రాంతయు తయై రాజకుమారుని హస్తము పరికించి చూచెను—శిరము బట్టి రాచెను—మోముపై నీరము జల్లెను—హృదయము పరీక్షించెను. ఇంక నేటి యాస! తన హృదయేశ్వరుఁడు మరణించెనని ఆకాంత గ్రహించి దుర్భర నిరాశాంధకార నిర్మగ్నయాయెను. అహా! పాపాత్ముఁడగు పోపు, ఎట్టి దారుణమొనరించెను! గోముఖ వ్యాఘ్రముం బోలు నాక్రైస్తవ జగద్గురువు విషప్రయోగమునఁదన కిష్టము లేనివారినిఁ బరిమార్చుచుండెను. నిజ పాపప్రవర్తనమునకుఁ బ్రతిఫలముగఁ దుదకుఁ దాను నట్టులే మరణించెను. అతఁ డంపిన మధురసము విషపూరితమని యెఱుంగక, జిజీము బేలయై త్రావి, యనంతానందసాగరమున నోలలాడవలసిన మహాసమయమున నీతెఱంగున నికృష్టముగ గతాసుఁడాయెను.

ఆ మందిరమున హెలీనా జిజీములు తప్ప మఱియెవ్వరు లేరు ఎన్ని గంటలైనను, హెలీనా యావలకు రాకుండెను. పరిచారకులు సాహసించి లోనికి రాఁజాలకుండిరి. ప్రధానపరిచారకుఁడు నిజహృదయారాటము బట్టఁజాలక, ఫలాహారావసరము మీఱినను ప్రభువు తనుఁజీరకుండుటచే మఱియు భీతిల్లియందుఁ జొచ్చెను.

జిజీము మృతకళేబరము పుష్పమాలాలంకృతమై సోఫాపై బడియుండెను. ఆప్రక్కనే హెలినాయును బడియుండెను? తనహృదయాధినాథుఁడు లేని జీవనము నిరర్థకమని యెంచి, ఆతని వదనము మీఁదనే దృష్టినిల్పి, మిగిలిన విషమును రయంబునఁ ద్రావిపూతచరితయగు నామానిని నిజహృదయేశ్వరుని సత్వరము చేరఁబోయెను.

## ౨౦

### మఱియొక రేయి వింత

కథ పూర్తియగు సరికి అర్ధరాత్రమాయెను. తదవసర ప్రకృతి సౌందర్యవైభవము వర్ణనాతీతముగ నుండెను. మేఘరహితమ్మై, కడు నిర్మలమై, యసంఖ్యాక నక్షత్ర విరాజమానమై యొప్పు నీలాకాశ సౌందర్యవైభవమును నిర్మలమగు బొస్వారిను జలరాశి పాదరసము చందంబునఁ బ్రకాశించుచుండెను. పగటి వేడి యింకను బూర్తిగఁ జల్లారకున్నను గమ్మని మందమారుతములు చల్లగ వీవఁదొడంగెను. మనోహరతోరణములు కట్టిన గులాబుల కారణమున నాప్రదేశము మధురసుగంధబంధురంబై యుండెను. విందున కమర్చిన దీపము లన్నియు నారిపోయినను, అంబర దీపిక లుజ్వలముగ వెలుంగుచుండుటచే నాలోపము కానరాకుండెను.

దల్తబను పాషా కడుశ్రద్ధతో నాకథ నాలించెను. కథ ముగిసినంతనే, యామహాసీయుఁ జెప్పటి యట్లు విమర్శచేయఁ దొడంగెను. ఒండొరుల చెంత నాసీనులైన గుల్నేరు లూకాసులును, తైరబా బాలియనులును ఖాలీలుని మధుర వాగ్గుంభనముల నమితోత్సాహముతో నాలించిరి. ప్రభుచెంతనే యాసీనయై యుండిన ఇస్మిల్డానతి యొక్క మాంసవతివలె సముచితముగ నవనతనయనయై యుండియు నానవమోహనాకారు నల్లనల్లనఁ డలకించుచుండెను. ఆమె మేలిముసుఁగు సగము తొలంగియుండెను. తక్కుంగల యువతులు అతిథులు వెడలినంతనే ముసుఁగులు వీడిరి.

జులేఖా తన మేనమామ ప్రక్కనే కూర్చుండి యుండెను. మిగిలిన యువతీయువకులవలె జులేఖా ఖాలీ యొండొరులతోనట సుఖో

పవిత్రులకెట్టి కవకాశము లేక పోయెను. తోఁగావుయొక్క యుపకరణముపై నందరు లుగొనియున్న ఇస్క్విల్లా యుండుండ, నెట్లు సాధ్యమగును!

హెలీనా జిజీముల దుర్మరణము నిక్కముగ గను విషాదకరముగ నుండెను. మన యువతీయువకులు గాఢప్రణయ మగ్నమనస్కులై యున్న కారణమున, హెలీనా జిజీముల విషాదచారిత్రము వారి హృదయమున నాటుకొనెను. కథా వివర్తనము యథాప్రకార మొనరించిన పిమ్మట, పాపా యిట్లనెను—

“పోపు ప్రయోగించిన తత్క్షణ ప్రాణాపహరణ సమర్థమగు విష మెద్దియో ఆశ్చర్యకరముగ నున్నది!”

“ఆర్యా! ఆ విషయము నేఁ గొంత యెఱుంగుదును. ఆ పాపిష్ఠి పోపు వంశజులు ప్రయోగించిన విషమును ‘టోఫానారసము’ అని యందురు. ‘టోఫానా’ యను స్త్రీ మొదట నా గరళము సృష్టించుటచే నట్టి పేరు ప్రసిద్ధమాయెను.”

అట్లు లూకాను పలికినంతనే, పాపా కుతూహల మధికతర మాయెను—“అందలి పదార్థములేవియో తెలియునా?”

“తెలియును. అది యొక విధమగు పాషాణము. ఆ ద్రవము నీటివలె నిర్మలముగను రుచిహీనముగను నుండును. ఆ మందు ద్రాక్షరసమునఁ గలిపినచో, నారహస్యమేరికిఁ దెలియరాదు—రంగు మారదు; మాధుర్యము భంగపడదు. అట్టి భయంకర విషపదార్థమును పోపు వంశజులు నిరాఘాటముగ నుపయోగించి, దయారహితులై, క్రూరులై, తమ వైరులఁ గడ తేర్చుచుండిరి. నిరుపమాన సౌందర్యవతియు, నిరంతర కామవ్యాపారనిమగ్నయు, పోపుయొక్క సోదరియు నగు ‘లుక్రీసు’ నిజమార్గావరోధ మొనరించుజాలు స్త్రీ పురుషులనెల్ల నట్టులే దారుణముగ వధించుచుండెను.”

“ఎంత దారుణము! అయ్యది రాక్షసవంశము గావలయు!

మిత్రమా! ఆ దుష్టౌషధమూ దుష్పరాధములతో సంతరించి యుండు గదా!"

"దురదృష్టవశమున సంతరింపలేను. ఈదుర్యోగము కడు సులభ సాధ్యమగుటచే, సంతరించి యుండదు. నే నీ విషయమునఁ దగు పరిశ్రమ సల్పియుంటిఁ గాన—"

బూకాను వాక్యము పూర్తి కాలేదు. కారణమేమన, తన మిత్రుఁడు ఖాలీబుండు భావగర్భితముగఁ దనవైపుఁ బిలకించు చుండెనని యాతని కాకస్మికముగఁ దోఁచెను. అట్టి ప్రసంగ మసంగతమని యాతఁడు మందలించెనని యెంచి, బూకాను వాక్యశేషమునుఁ బలికి వేయెను. తోడనే, ఖాలీబుండు తనదృష్టి మరలించి యువనతవదనుఁ డాయెను. ఆకారణమున, ఖాలీబునకు వీక్షణముఁ జేసే మూర్ఛమునుండ దడసియు, శాసకారణముగ భ్రాంతియుతుఁడై తినవియు బూకాను భావించెను. అంతలో, పాషా యిట్లు ప్రశ్నించెను.—

"నీవేమి చెప్పుచుంటివి! నీ వొనరించిన పరిశ్రమ ఫలితమేమి?"

"ఆపాత్రుసంశజులు ప్రయోగించిన విషము నేటిరష్యావర్ద్యాదులకు నిక్కముగఁ దెలియునని చెప్పఁగలను."

"అల్లా! రష్యారాజవంశజు లిట్టులే కడ తేరియుందురు!

"పాషా! సందేహము లేదు. రష్యాదేశచరిత్ర పరిశీలింతమేని, ఈవిషయము తెల్లమగును. పదిమంది నృపాలురలోఁ దొమ్మండ్రు బలవన్మరణము పాలైరని తెలియఁగలదు. అందు విషముచేఁ జచ్చిన వారిసంఖ్య యధికతరము. ఆ విషము నేఁ జెప్పిన టొఫానా రసమే. దాని ప్రభావమెట్టిదన, తన్మూలమున మరణించు దౌర్భాగ్యుఁ డెట్టి వికారము జెందక సామాన్యముగనే యుండును. తద్రహస్య మెవ్వరికిఁ దెలియనేరదు. అవిష మతి స్వల్పముగ నొసంగినచో, నరుఁడు దీర్ఘరోగపీడితుని చందమునఁ గ్రమక్రమముగాఁ గృశించి మరణించును.

అధికముగ నొసంగినచో, మన హెలీనా జాతమువలె తానును మరణించును.

అంతట ఖాలీలుని వీక్షణము నగుచు లూకాసు స్తబ్ధుఁడాయెను. తన మిత్రుఁడు నిక్కముగ మూర్ఛిల్లుచుండెనని యాతఁడు దృఢముగ గ్రహించెను. ఖాలీలుఁడాపగిది విముఖుఁడగుటకుఁ గారణ మెద్దియో తెలియకున్నను, ఆప్రసంగమింక విరమింపవలయునని లూకాసు భావించెను.

ఖాలీలుని భావముగ్రహించి, రేయి చాల మీఱుటచేఁ దామింకఁ బోవలయునని జులేఖా తన మామనుఁగాంచి పలికెను. ఖాలీలుఁడు మఱియొక కథ చెప్పిన వినవలయునని కుతూహలముఁ జూపెనయ్యు, జులేఖా పలుకులు వీనులఁబడినంతనే దల్బహాపాషా దిగ్గున లేచెను.

ఇస్మిల్లా జులేఖా పాషాలు ముందు నడిచిరి. తక్కిన యువతీ యువకు లైదుగురు వెనుకబడిరి. కాన, సుల్తానా లూకాసులును తైరజా జూలియనులును పరస్పరరహస్య సరససంభాషణ మొనరించుట కవకాశము చిక్కెను. ఆ వెనుకనుండిన ఖాలీలుఁడు, పాషా స్త్రీజన సహితముగా మందిరాంతర్గతుఁ డౌటఁగాంచి, లూకాసును వెనుకకు లాగి యాతని శ్రవణమున నడినడి నిట్టుల నెను—"మిత్రమా? ఎట్టులో నీవు జూలియను మందిరము ప్రవేశింపుము." అనంతరము జూలియను తోఁగూడఁ దదుచితముగఁ బలికి మఱవవలదని హెచ్చరించి, తన మిత్రు లిర్వురు దమ ప్రియకాంతలవద్ద సముచితముగ సెలవు గైకొను టకు వీలగునట్లు ఖాలీలుఁ డొకింత దవ్వునకుఁ బోయెను.

తురుష్కయువకుఁడు క్రమముగాఁ దనమందిరము ప్రవేశించెను. ప్రభువు చూచుచుండగనే, లూకాసు మందిరము జూలియను, జూలియను మందిరము లూకాసును నిబ్బరముగాఁ జొచ్చిరి. మధురసము తలకెక్కిన పాషా తద్విషయము జూచియుఁ జూడఁజాలకపోయెను. యథాప్రకారము ద్వారపాలకులు బీగములు వైచి, యాగదుల తమ శయ్యా

క్షత్రి పాపాసంగతి స్మరణకుఁ దెచ్చెను. లూకాను ఇట్లు మాట లాడెను—

“అమీనా! నీ వీమందిరమునకు రాగతంబెద్దియో—నాకేల, కాని, పాపా తీర్థభార్యా మందిరమున లేదనిమాత్రము చెప్పఁ గలను.”

“ఔనుగాక. పాపా యేక్షణమైనను రావచ్చును. ఈదేశ సాంప్రదాయము నీ వెఱిఁగియుండవు.”

“అపాయమును వెనుదీయువాఁడఁ గాను. అమీనా! పిఱికిపంద నుండవలె నారీజనసమ్మందహాసమునకుఁ బాత్రుఁడఁగాఁను. మఱియు, అపాయమునుండి నిరపాయముగాఁ దాను వెలువడుటయేగాక, నిజమునో వారినిఁగూడ నేర్పుమెయి తప్పింపఁజాలని స్త్రీ యొక స్త్రీ కాదు. కాన, ఇఁకఁ గాలయాపన మొనరింపక నన్ను గొనిపొమ్ము.”

అంత నాదాసి ఇట్టుల స్పష్టముగ గొణఁగెను.

“బాగు! తప్పేమి? ఈసమయమున కాతఁడు గాకున్న, నీతఁడాయె. కాని, అంతకంతకుఁ జిక్కగుచున్న ఈ వ్యాపారమునసే ప్రమాద ముప్పతిల్లునోయని మాత్రము భయమగును.”

అంతట, లూకాను విసువు నభినయించి ఇట్లు ప్రశ్నించెను—
“అమీనా! ఏమనుకొనుచున్నావు? కాలహరణమగు—”

“ఆర్యా! నీ వితరణముం గొనియాడుచున్నదానను” అని యుక్తియుక్తముగఁ బలికి, మగుడ నిట్టు లనెను— “ఆర్యా! నీ మాట కాదనఁజాలను. పోదము రమ్ము.”

వారిరువురు గదినుండి వెలువడినంతనే, అమీనా భద్రముగఁ దాళము వైచి ముందుగ నడచెను, లూకా సామెను వెంబడించెను. ప్రదేశమంతయుఁ గడు నిశ్శబ్దముగ నుండెను. అమీనా లూకానులు నిరపాయముగా దొరసాని శయ్యాగారము డాసిరి. పాపా పాదరక్షలచ్చట

గానరాని, అయినా నిర్భయముగాఁ దలుపు తెఱచి, నిజానుచర సహితముగా నంతఃప్రవేశించెను. తత్ప్రథమ మందిరమున నిలిచి, దాసి యిట్లు లనెను—“అయ్యా! అల్లదే మా చారసాని శయ్యామందిరము. నీ వాక్చాతుర్యమున నామె నెట్లు సమాధానపఱచి నైనను కొనసాగించుకొందువో!—సత్వరము పొమ్ము!”

లూకాసు తోడనే రెండవమందిరముగూడ గడచి, ప్రభుపత్ని సమక్షమునకుఁ బోయెను. మృదుల మోహనహంసతూలికాతల్పమున నొయ్యారముగ వ్రాలి, నిజహృదయాపహరణ క్రియాదక్షుఁడగు తురుష్కమన్మథుని కై తత్తరపడుచుండ వేఱొకఁడు గోచరించుటచే, నా మదవతి సహజముగ విస్మయాగ్రహపరవశయై కడు జీకాకుపడెను. కాని, లూకాసు మాత్రము నిరసింపఁదగిన వాఁడా? వాని సమున్నతాకారము, దీర్ఘబాహువులు, పేరురము, సుందరగంభీరాననమును దప్పక దర్శనీయములు. గాన, నాస్వైరిణి మఱియొకసారి లూకాసును గాంచి తదాలోచనాధీనమానసయై యుండ, నాతఁడు తద్భావపరివర్తనము గుర్తించి, సమీపించి, మనోహర నిశ్చలస్వరంబున నిట్టులనెను—

“సుందరీమణీ! కేవలము ప్రమాదవశమున నిన్నుఁ గాంచు నపూర్వమహాభాగ్య మలవడెను; ధన్యుఁడను!”

ఆ ప్రౌఢ కాంత యంత కృత్రిమనిరాదరణస్వరంబున నిట్టులనెను.

“ఆర్యా! ఈ తెఱంగున శుద్ధాంతమునఁ జొరబడుట సాహసమని యెఱుంగవా? కాని, ప్రమాదమంటివే! ఏమది?” వర్ణనాతీతమగు నా సుందరాంగుని సుందరనయనద్వయముపై నాధీరవీక్షణములు నిలిచిపోయెను. గ్రీకుయువకుఁ డిట్టులనెను—“కాంతామణీ! యథార్థ మెఱింగించెద, క్షమింపుము. ద్రాక్షారసపాన మొకింత యధికతరమగుటచే దల్పబనుపాపా—”

"ప్రవక్తయగు మహమ్మదు నిషేధించెను!"—నిసీలక్కుశ్రురాజి కారణమున మాటికిని మాటికియు దీపించు నా మోహాగ్నిని నుండిన దంతపు దోంతరలం గాంచినంతనే యూ కాంతుని చకితహృదయుఁడై మోహావిష్కారోద్భూతనిశ్వాసుఁడై మగుడ నిట్లనెను.— కాని, మనము దుర్బలమానవులముగదా."

"నిక్కముగ దుర్బలులము! కాదేని, నేని మానవవిజ్ఞానమునకుఁ జిక్కువాఁడఁ గాను."

"కాని, ప్రమాదవశమున నంటితివే! అదేమియో సత్యాగము జలు కుము."

"మధురసము తలకెక్కిన దల్లబనుపాషా, ఖాలీలుఁడు వారింపఁ గడంగినను సరకుసేయక, మమ్మొకరి మందిరమున నింకొకరిని బంధించెను. నేఁ జెప్పు ప్రమాద మయ్యది. కాని, తత్ప్రమాదమే నాకీ మహాలాభ మొడగూర్చెగదా."

"ఖాలీలుఁడు వారింపఁ గడంగెనా?" అని యథాలాపముగా నిస్త్రిల్లా ప్రశ్నించెను. కాని, నిక్కముగ నా కామిని అసిర్వాచ్యానందప్రకంపితహృదయ యాయెను. కారణ మేమన, ఆమె చిత్త మింకను సుందరతురుష్కయువజనాధీనమై యుండెను. తనపైఁ గల మక్కువకతంబుననే పాషాను వారించి ఖలీలుఁడు నిజమందిరాంతరంబున నుండఁ బ్రయత్నించెనని యెంచి ఆమె కడు ముదమందెను. లూకాసు మగుడ నిట్లులనెను.—

"సుందరీమణీ! నిజము. ఒకని మందిరమున నింకొకనిఁ బెట్టుచుంటివని ఖాలీలుఁడు విస్పష్టముగఁ బలికెను. కాని, అనలే మతి మాలిన ప్రభువు వాదించినచోఁ గ్రుద్ధుఁడగునని యెంచి, నేనును నా మిత్రుఁడుం గలసి ఖాలీలుఁడు మాటాడకుండ చేసితిమి.

ప్రభుపత్ని వీక్షణమధుకరములు గ్రీకు మనోహరవదనపంకేరు

హము వీడి రాఁజాలకుండెను. అనంతర మేమాయెనని ఆమె ప్రశ్నింప యూకానిట్లనెను.—

"నేను ఖాలీలుని మందిరము జొచ్చి శయ్యపై నాసీనుఁడనై సంతనే తలుపు తెఱచి అమీనా ప్రవేశించెను. అం దెవ్వరుందురని దాసి ఎఱింగియుండదు. కాని, కాంతామణీ! క్షమింపుము. నీ పరిచారికను గాంచినంతనే నా హృదయమునందొక యూహ జనించెను. నే నిందనుక గుల్నేహను ప్రేమించి యుంటినని విశ్వసించితి. అది వట్టిభ్రమ యని ఇప్పుడు తెలుసుకొంటిని. నీలమేఘ విముక్త సుధాకరబింబముం బోలిన అద్వితీయ సుస్నిగ్ధశోభాసమన్వితమగు నానన మనోహరారామము నీయందుఁ గాంచినంతనే, నా హృదయము నీ యధీనమాయెను. మఱియు, భవదీయ మనోహరవదనసందర్శనార్థమే గదా, కొన్ని దినములక్రిందట నేనీ మందిరమునకు రప్పింపఁబడితిని! కావున, అమీనా గోచరించినంతనే, ప్రథమముగఁ జిక్కిన సదవకాశమును వృథా సేయరాదని నిశ్చయించితిని.—"

"నిన్నిందుఁ బ్రవేశపెట్టవలయునని అమీనాను బ్రతిమాలితివి కాఁబోలు!"

"తరుణీమణీ! నిజము. కాని, నాపైఁ గినిసిన గినియుము—నీదాసిని మాత్రము మన్నింపుము. నాలాలింపులకును బెదరింపులకును దాసిఁజాలక నాకుఁదోడ్పడెను."

ప్రభుపత్ని వెంటనే బదులాడక, లోలోనఁ జింతించెను. ఆమె వీక్షణము లుండుండి గ్రీకుయువకుని మనోహరాకారముపై బర్వెడుచుండెను. దుర్బలస్త్రీజన సహజస్వాతిశయాహంకారములు ఆమె మానసమును జేకొనెను. గుల్నేహను వలచిన యూకాను, ఆమె సౌందర్యము గాంచి, తొంటివలపు నుఱిచి మోహపరవశుఁడై, కృపణుఁడై, ప్రభుపత్ని కిట్టిమాట నుండెను! ఆమె హృదయ మెట్లు కంపింప

కుందునని?—"పౌరుషవంతుఁడా! నీపలుకులన్నియు నిక్కములగునా? నన్ను నిక్కముగఁ బ్రేమింతువా?"

గీర్వాణి యువకుఁ డనురాగపూరితనేత్రుఁడై నా నేమము నిట్లు బదు లాడెను.

"భవదీయభాసురవదన సుధాకరబింబము గాంచుటయును, బ్రేమించుటయే. హా! తరుణీ! మనవహారామమధ్యమున బాలికలు చుట్టు సుఖాసీనులమై కథాశ్రవణాతురులమై యుండునపుడు నీదు కుటిలముఖ వనసము తొలంగకుండెనేని, నాహృదయమున కట్టి యారాటము లేకుండెడిది—నాగుల్నే నాహృదయాభిరాజ్ఞి యని యింకను భ్రమించి సంతసించుచుండెడివాఁడను. నీవంటి యపూర్వసౌందర్య సముజ్జ్వలాంగిని భార్యగా వడసిన దత్తబనువాహా నిక్కముగ నదృష్ట వంతుఁడు! ధన్యతముఁడు!"

తదాలాపము లాలించి ప్రభుపత్ని సంతుష్టాంతరంగయై తన చెంగట నాసీనుఁడుగావలయునని యూకానునకు సన్న మొనరించెను. కాని, మోహంపుఁదల్పమున నొయ్యారముగ వ్రాలియున్న యమచ్చ కంటి సముజ్జ్వలసౌందర్యమై భవనంబున కోహటించునానివలె నాగ్రీకు అవనతవదనుఁడై ఆసౌందర్యరాశి కొంకింతదవ్వున నాసీనుఁడాయెను. విటులా తెఱంగున నటించుటయు, దాసస్త్రీలిట్లు లుప్పొంగుటయు సహజము. అంత నాయిందుముఖి నిజసుందరకరాబ్జమునందీయ, నా యువకుఁడు లేనియుత్సాహము దెచ్చికొని మోహాతురంబున ముద్దాడి తోడనే రయంబున దత్తరంబున విడిచిపుచ్చెను. నిజాతులిత సౌందర్య వైభవవీక్షణాపసరదిగ్భ్రమము కారణమున నాయువకుఁ డట్లులాచ రించెననియు, తానొక మందహాసమొనరించునంతనే నాభీరుఁడు ధైర్య ధుర్యుఁడై రయంబున నిజభుజవల్లరీపంజరబంధితుం జేగునని యు ప్రభు భార్య భావించి కనుంగొను చుండెను. కాని, యూకాను అవస్థ

కనువిపరీతముగ కేవలము వర్ణనాతీతముగ నుండెను. ఆతని చిత్తము గుల్నేరుకాంతాధీనమై యుండెను. ప్రభుపత్నిపై మోహము లేదు. తనుపట్టి దుర్వ్యవసాయమునకు నియోగించిన ఖలీలుని యభిప్రాయ మేమో యాతఁ డెఱుంగఁడు. ఐనను, మిత్రవచోబద్ధుఁడై బూకాను నాటకమాడుచుండెను. ప్రభురాణి యిట్లు ప్రశ్నించెను—

"ఖలీలుఁడు నాగుఱించి యేమైనఁ బ్రసంగించెనా?"

ప్రసంగించెను. మొదట నిన్నుఁ గాంచినపుడు నీసుందరాననము వసనాచ్ఛాదితమైయుండినను, భవదీయ దివ్యాకృతిఁ గాంచియే నా మిత్రుఁడు విగతధైర్యుఁడాయెను. అనంతరము తదభిసరణమునకు దొరకొనెను. కథాశ్రవణావసరమున నావలె నాతఁడును నీయపూర్వ సుందరాననము తప్పక కాంచియేయుండును. అతఁడు నిక్కముగ నీపాదసేవాపరాయణుఁడే!"

"ఖలీలుఁడు మాపరస్పరసమావేశము గుఱించి నెల్లడిచేయలేదు" అని లోలోన సంతసించి, మధురమందహాసవిరాజితవదనయై ఇస్మైల్గా ఇట్లనెను—

"ఆర్యా! స్తోత్రాతిశయము మా జాతిలక్షణము గదా—కావున నీవన్యథా తలంపవలదు—నీమిత్రుఁడగు ఖలీలు నన్ను గుఱించి ప్రశంసించెనా?"

"వాఁడును ఖలీలునివలెనే నీదు సౌందర్యముగ్గడించెను. కాని, మోహనాంగీ! నామిత్రులమాట కేమి?—నేనే నీహృదయమునకు నచ్చినవాఁడనని పల్కి నన్ను ధన్యాత్మునొనరింపవా?"

లజ్జారుణావనతవీక్షణయై, ప్రభుపత్ని యిట్లనెను. "సుందరాంగా! నీకీసందియమేల? అమీనా తొలుదొల్త నన్నిగ్గా కాంచి మదీయారామగృహంబునకుఁ గొనితెచ్చెను! దురదృష్టవశమున నాన సమయమున విఘాతము సంభవించెను. ఐననేమి! భవదీయమనోహర

రూపవైభవము గుఱించి చేయొనరించిన అమీనా యభివర్ణనము నా మానసమున నాటియున్నది. నాపుత్రికామందిరమున నిన్నుఁగాంచి నంతనే, నాపరిచారికవర్ణన మతిశయోక్తి కాదని రయంబునఁ గుర్తించితిని. ఎట్లు ప్రేమింపకుందును? మఱియు, నీపై మోహము లేదని నాయంతిపుర మీతెఱంగునఁజొచ్చిన నిన్ను సైరింతునా? కావున, నీకెట్టి భయమువలదు. జూలియను ఖాలీలులతో నాకుఁ బనిలేదు. నాకిప్పుడు నీవే ప్రేమాస్పదుఁడవు—సర్వము నీవే—”

లూకాసుతోడనే మోఁకరించి, ఆమోహనాంగి కోమలకరపల్లవంబును మగుడ ముద్దాడి, వెనుకటివలెనే పిడి, మఱింత దప్పానకుఁ బోయి, జాజ్వల్యమానసౌందర్య విహ్వలహృదయుఁడైనట్టి విస్మయవిశాలానిమిషనేత్రుఁడై యట్టె నిలిచిపోయెను. ప్రభుకాంత మఱియు మఱియు సంతసించెను. క్షణక్షణ ప్రవర్థమానమగు మోహాతిరేకమున రయంబునఁ బైకొని యనవమోహనాకారుని నిజబాహుపంజరమున బంధింపవలయునని తలంచియు నాతని యధైర్యసంభ్రమంబులంగాంచి వెనుదీసి, ఒకింత ధైర్యము గఱపనెంచి, యువజనహృదయము నీరగునట్టి సుందరనీలవీక్షణాంబులఁబఱపి, ఆమె అత్యంత మృదుమధురకలస్వనంబున నిట్టులనెను—

“సుందరాంగా! కేవలము క్షణికమగు కామవికారము కానోపు నీదు మోహమున కలది ఊఁకొందునేని, నీవేమందువో?”

తదవసరోచితోత్సాహస్వరమున లూకాసు సముచితభాషణంబుల బలుకాడెను. అంత నావగలాడి వర్తులమై, సుందరమై, హిమసన్నిభమై కీపించు నిజభుజకాండము ప్రదర్శించుటకునై తనకంచుకాంతమునందలి బంగరు జలతారు స్వల్పనబరీక్షించుచు నిట్టులనెను—

“కాని, అబలలమగు మమ్ము బురుషులు కఠినవిమర్శన మొనరింతురు.”

సుందరాంగీ! నే నట్టివాఁడఁగానని విశ్వసింపుము.''—తన ప్రవ
ర్తనము లూకానుసకే సిగ్గుగఁ గాన్పించెను. తనను మన్నించిన యౌవనో
సిగశిఖపుష్పుఁడైన యువాగ్రేసరు మనసునేసి సరసమున కొనియాడినను, మో
హావశనయ్యుఁడైన రసికమనునివలె సముచిత సరససంభాషణానురక్తుఁడై
యా ప్రౌఢాంగనను గన్నుఁ బ్రాసెను! ఆమె యిట్లనెను—

సుందరాంగా! నీకు సహస్రవందనము లర్పింతును. నీయౌదా
ర్యము కడుశ్లాఘనీయము. దాన నాహృదయభారము తొలంగెను.
ఇల్లాలనయ్యు, హృదయదౌర్బల్యంబున మోహపరవశనై నిన్నుఁ
బ్రేమింతునేని, నన్ను నిరసింపవుగదా?''

"నిరసనమా! ఎట్లు నిరసింపఁగలను? కాని—సుందరీ ఈప్రదేశ
మున నేయపాయము సంభవింపదు—''

"ఆహా! చెప్పఁజాలను. మాదేశమున స్త్రీ స్వాతంత్ర్యము
సున్న. మగఁడు సర్వాధికారి; ఆలు తదధికారబద్ధయై యున్నది.
కావున, ఏముహూర్తముననైన రానగును. ఐనను, మన కపా
యము వారయకుండ నుపాయము గలదు. అల్లదె, మొగమలు
తెర—ఆవెనుక నున్న ద్వారము దాటినచో, పాపా ధనాగార ముం
డును. ఆపత్కాలమున నామార్గము శరణ్యము—కాని, మోహ
నాంగా! ఈసుఖసమయమున మనచిత్తము భయాధీనము కానేల?
ఏవిచార మెఱుంగక, హాయిగ నుందము.''

ప్రభుపత్ని యట్లుపలికి, మోహాతురంబున దనచెంతకు రమ్మని
లూకానుసకు సన్నయొనరించెను. ఇఁక, మనోహరయువజనబాహు
పంజరబంధితయై అనిర్వాచ్యానందసౌఖ్యార్ణవతరంగడోలికల నుయ్యాల
లూగఁదలంచిన యామదవతికి అంతలో నడుగుల సవ్వడి దడదడ విన
వచ్చెను. మోమెత్తి చూచినంతనే, విపరీత భయవికారవదనయై,
ఉన్మాదిని చందమున బిఱ్ఱబిఱ్ఱనరుదెంచు నమీనా గోచరించెను!

ఇస్మిల్లాబూకాసులు భయభ్రాంతులై దిగ్గునలేచిరి. ప్రభుభార్య రయంబునఁ దెలివొంది, నిజపరిచారికా సందేశము గుర్తించి, తన సరసుని శ్రవణమున వడివడి నిట్టులనెను—"ఆర్యా! అపాయోల్లంఘనోపాయము ముందుగనే తెల్పుట మేలాయెను—ప్రభువరుదెంచువాఁడు—తక్షణ నిమార్గమునఁ బొమ్ము—ఆలసింపకుము—మఱియొకసారి సుఖింపనగును!"

అట్లుపలికి ఆకాంత, తెర తెఱచి, తదంతరరహస్యకవాటము చయ్యన సడలించెను. అందు బూకాసు రయంబునఁ బ్రవేశించెను. తోడనే, ప్రభుపత్ని తలుపువైచి, కొండపటము సరిదిద్ది, ఏతెంచు మగనికి యథాస్వాగతమొసంగుటకై నిశ్చలవదనము దాల్చెను. ఆముహూర్తముననే పాషా యామందిరమునఁ గాలిడెను.

## ౨౧

### తాకము

రహస్యమార్గాంతర్గతుఁడైన బూకాసు మిత్రహితోపదేశానుసారముగఁ దోడనే శస్త్రధరుఁ డాయెను. ఎట్టి యపాయ ముప్పతిల్లునో యని ఆతఁడు సహస్రనయనములతో నిటునటు దిలకించుచు గడుంగడు నప్రమత్తుఁడై యుండెను. మనకుఁ జిరపరిచితమగు లోహదీపమందు వెలుంగుచుండెను. కాని, ఖాలీలుఁ డట్టి విపరీతకార్యమునకుఁ దనమిత్రు నేల నియోగింపవలయును? బూకాసున కేమియు దోఁపకుండెను.

గ్రీకుయువకుఁ డప్రమత్తుఁడై భద్రముగ నడచి సిద్దీగది సమీపించెను. నీలజీమూతసన్నిభుఁడగు నాదీర్ఘకాయుఁడు చిత్తుగఁ ద్రావి

ఘుర్ఘురధ్వాన మొనరించుచు మైమఱచి నిద్రించుచుండెను. ఒక్క
జాముక్రిందటనే వాఁడే మెలంగిన దొంగవలె నిర్జనారామమందిరముఁ
జొచ్చి రుచిరాహారంబులను మధురసమును దస్కరించెనో, వెనుకటి
ప్రకరణమునఁ గాంచియే యుంటిమి.

సిద్ది నిద్రించుటచే నే ప్రమాదము లేకపోయెను. తత్ప్రాంత మతి
క్రమించి లూకాసు సోపానములనంక దిలకించుచుండ, ఖాలీలుఁడు
గోచరించి యాతని ఢాసెను. సిద్ది నిద్రాపరుఁ డాయెనని యెఱింగి
నంతనే, కార్యము సులభతరమాయెనని సంతసించి, తన ఖడ్గము
సారించి, నిజానుచరసమేతుఁడై ఖాలీలుఁడు వానిచెంతకు బోయెను.

సిద్దిని తీవ్రముగ దట్టుచు కుదుపుచు ఖాలీలుఁడు మేల్కొల్పెను.
వాఁడు తోడనే త్రుళ్ళి మేల్కాంచెను. కనువిచ్చినంతనే ఖాలీలుని
భయంకరమూర్తియు, భయంకరతరసునిశితకరవాలమును గోచరించు
టచే వాఁడు మరంతభయాధీనమున గడగడలాడెను. ఖాలీలుఁడు
కఠినముగ నిట్టులనెను.—

"ఓరి, సేనకాధమా! నీవు నా యధీనమైతివని యెఱుంగుదు
గదా—మాయామర్మములు విడిచి నీకథ పూర్తిగఁ దెలుపవలసిన
యవసర మరుదెంచెను—పరిస్థితు లనుకూలింపమి, నేనిందనుక వేచి
యుంటిని—"

దుర్భరభయవికారవదనుఁడై, సిద్ది యిట్టులనెను.—

"ఆర్యా! నీవెవ్వండవు? చూచుటకు బాలుఁడవయ్యు—నన్ను
గాంచిన మొదటి నిముసముననే నాపై నధికారమువహించి శాసింప
నారంభించితివి!—నీకుఁగలప్రభావ మేమియో తెలియకున్నది—"

"ఓరీ! నేను మూర్తీభవించిన క్రోధమని యెఱుంగుము? అవసర
మగు నవసరముల దయాదాక్షిణ్యములకుఁ గొఱఁతయుండదనికూడ
గ్రహింపుము." సిద్ది భయాతురంబున సమ్మతింప, నాతురుష్కయువ

కుఁడు తొంటి కఠినస్వనమున నిట్లు లాజ్ఞాపించెను—"లెమ్ము! నీఖడ్గము నిటనుంచి ముందునకుఁబొమ్ము—నేఁజెప్పినట్లు చెప్పినంతనే యొనరింపవలయు!"

ఖాలీలుఁడు మానవాతీతాధికారధురంధరుండై శాసించుచుండి నట్లు తోఁచెను. పాషా సేవకుఁడు చెప్పరాని భయసంభ్రమంబులచేఁ ద్రిప్పువడి, కట్టెదుటనున్న యధికారమూర్తిని దేఱిచూడఁజాలక అధోముఖుఁడై అల్లనఁ దిలకించుచు, ఆతని మిత్రునిఁగాంచి మఱియు వెఱగందుచు లేచినంతనే, ఖాలీలుఁ డా శిలాసోపానములఁజూపి నడు మని కఠినముగ నాజ్ఞాపించెను.

మిత్రద్వయము పిఱుందనరుదేఱ, సిద్దీ మెట్లుడిగ్గి, నేలయందడఁగి యున్న దారుకవాటము సమీపించెను. వాఁడు తత్క్షణము భయ విహ్వలుఁడాయెను. తురుష్కవీరుని యభిప్రాయము వానికి స్ఫురిం చెను. మందిరాంతరారామమున కందుండి యొక మార్గముండెనని గతప్రకరణమున నరసియుంటిమిగదా. తత్కవాటము కుడ్యపదార్థ ముతోఁ గలసిపోవునట్లు కడునిపుణముగ నిర్మితమై యమరియుండు టచే ఖాలీలుఁ డింతకుఁబూర్వ మరయఁజాలకపోయెను. కాని, విషయ మెఱింగిన కారణమున నాతఁ డీసమయమున దద్ద్వారమును సులువు గనే గుర్తించెను. అంత నాతఁడు సిద్దీనిఁగాంచి, ఆద్వారపుఁదాళ మొసంగుమని అధికారపూరితస్వరంబునఁ గోరెను. భయాతిరేకమున నోడలంతయుం జెమ్మటక్రమ్మ, వాఁ డిట్టులనెను.—

"అయ్యా! బీగ మిదిగో. కాని, పాషా ప్రశ్నించునేని, ఏ మందును?"

"పోయె నని చెప్పుము. నీవు భయపడకుము—ఈగంటయందె నేను పాషాతో మాటాడవలసియుండును—"

"ఏమైనను, నాపనిసరి. అయ్యా! పాషా స్వభావము నే నెఱుం

గుదు. ప్రళయాసిల సన్నిభమగు నా మహాసీయుని దురాగ్రహామునకు ఇంధనమునై నేను బ్రుగ్గవలసినదే!"

దుర్బలునిపగిది గంపించు నాక్రోర్షకాయుని కరమునందలి తాళము గైకొని, ఖాలీలుం డిట్టులనెను—

"సేవకా! నిన్ను రక్షింపఁగలను. నీవాభయము విడియుండుము. ఏ కారణముచేనైన నా సంకల్ప మీా సమయమున భగ్నమైనను నేను మఱికొంతకాలము వేచియుండవలసినను, నీతాళము నాచేత నుండుటచే నీవలన నా కెట్టి యపాయము వాటిల్లనేరదు. నీవు తప్పక మ దాజ్ఞానువర్తివై యుండుము."

"అయ్యా! నే నిప్పటికే నీయాజ్ఞకు బద్ధుండనై యుంటిని. నన్ను నీ వకారణముగఁ గసుఁదూలనాడితిని, రహస్యభంగ మొన రింపలేను—"

"చాలు! నేఁ జెప్పినటులకు నట్టులే మెలంగుము. ఇఁక నీతెలుపు తెఱువుము!"

అట్టు లాజ్ఞాపించు ఖాలీలుఁ డీ సమయమున దుర్నిరీక్షుఁడై ఆతని కంతి మీానమయమున నధికతర గంభీరాధకారపూరితమైయుండెను. వీక్షణములు తీక్ష్ణతరంబుగ నుండెను. సిద్దీ భయ మధికతమ మాయెను: వాని మేనెల్ల వడంకఁజొచ్చెను. కట్టెదుటనున్న భయంక రాధికారమూర్తిని నిరాకరింపనేరక, తాళ మొసంగుటకు ధైర్యము చాలక బ్రమాన్పడియున్న సేవకునిఁ గాంచి, ఖాలీలుఁడు తీవ్రతరంబుగ నిట్టులనెను—

"ఓరి, సేవకా? ఈ రహస్యకవాటము రయంబునఁ దీయుము!— కార్య మొనరింపక అట్టు లేల నిలిచెదవు?—ఓరీ! మఱియొకసారి చెప్పెద—ఇంకను ఆలసింతువేని, మదీయ ఖడ్గధారకు గుఱియై తారున మరణింతువు!"

సిద్దీ యింక నుపేక్షింపఁజాలక, పాషావలనఁ దనకుఁ బ్రాణాపాయము వాటిల్లకుండ రక్షింపవలయునని దైన్యముగఁ బ్రార్థించి, ఖాలీలు నాజ్ఞ నాదలఁ దాల్చి, కార్యమునకుఁ బూనెను.

గోడయం దమరియున్న ద్వారముచెంత నొకకనుపసీల యుండెను. సిద్దీ బలముగ నొక్కినంతనే అయ్యది ఒక యంగుళము గోడలోనికి దిగిపోయెను. వాఁ డంతట భూమ్యాంతర రహస్యద్వారపు కవాటము చెంతకుఁ బోయి ఒకవంక నొక్కినంతనే, యవ్వలికొన లేచెను. ఆహా! ఎంత విపరీతము! ఆ ముహూర్తముననే, నిస్సిల్లా మందిరాంతర రహస్యద్వారము తెఱచినసవ్వడి అయెను. బాసిసీఁడు తోడనే పిడుగుపడినభాతి బెగడునడి, మందస్వరముననే 'పాషా!' యని అఱచెను. సవ్వడియేగాక ఈ గంభీరాలాపములు విస్పష్టముగ వెలువడెను. "ప్రేయసీ! ఈ స్వప్న మనర్థదాయక మని తోఁచెడిని. నా ధనాగారము సురక్షితముగ నుండునా! తత్క్షణము పోయి చూడవలయు—"

సిద్దీ ప్రాణము లెగిరిపోవుచుండెను. వాని శ్రవణమున ఖాలీలుఁ డిట్టులనెను. "భీతిల్లకుము. వీని నెప్పటియట్లు లమర్చివేయుము—నీ ప్రాణము నా యధీనముసుమా!—విశ్వాసఘాత మాచరింపకుము—భయము వలదు!"

"అయ్యో! తాళము!" అని వాఁడు మరణావసర విహ్వలస్వరమున నడిగెను.

"పోయెనని చెప్పుము. అపాయము ఘటిల్లకుండ నేను రక్షింపఁగలను."

లూకాసు ఖాలీలు లా క్షణము నిశ్శబ్దముగ సహాయులైరి. సిద్దీ ప్రాణము పిడికిటఁబట్టి, కదలిన తలుపును కీలను యథాప్రకార మమర్చునంతలో, నిస్సిల్లా పలుకు లీవిధి వినవాయెను—"నాథా!

వృథా యలజడి యేల? కల కింత వెఱపా? నీ సేవకుఁడు దయ్యమువలె నిరంతరము గాఁపుండ, ఎట్టిభయము! రమ్ము! మదుపోఁతల్పుండవై హాయిగ నిద్రింపుము!”

“వలదు, వలదు! కలలు కల్లయని తృణీకరింపరాదు. స్వప్నములు భావిశుభసూచకములు. నీ విందే యుండుము—వచ్చిన రమ్ము: నీ వనునట్లు నా సేవకుడు నిక్కముగ స్వామిభక్తి పరాయణుఁడై, విశ్వసనీయుఁడై, అప్రమత్తుఁడై కాఁపుండెనో, లేదో తీక్ష్ణ మరయ వలయు.”

తత్సంభాషణమున పాషా నిమగ్నుఁడై, అంతఃపురపు నాతలుపు పూర్తిగ దెఱవఁడాయెఁ గాని, తెఱచినచో సిద్దీపడుపాటు వ్యక్తమై యుండెడిది. కాని, వాని యదృష్టవశమున నాద్వారము విస్తృతమగు సరికి, కార్యము పూర్తిఆయెను. నిజభార్యాసమేతుఁడై పాషా యంత నా మెట్లుడిగ్గదొడంగెను. తలుపు తెఱచినంతనే ప్రభుపత్నియొక్క తీక్షణ వీక్షణంబున నాసీమయంతయుఁ బరిశీలించెను. ఆమె హృదయ మెటులుండెనో పాఠకులు గ్రహించియే యుందురు. ఒక్కనిముషము క్రిందనేగదా, లూకాసు ఆమందిరమునుండియే ఆమార్గమునుండియే యగుదెంచెను!

ప్రభ్వీ ప్రభువులను గాంచినంతనే, సిద్దీ అమితభయవినయ సంభ్రమాకులుఁడై ఎదురేగి, సముచిత దూరంబున యథాక్రమముగా సాష్టాంగ మాచరించెను. పాషా యిట్టులనెను—

“మన్సూరా! లెమ్ము. జాగరూకుఁడవై యుంటివి-సంతసించితి అరె! ఖడ్గము కానరాదేమి! కాఁపరి నిరంతరము ఖడ్గధారియై యుండవలదా? తొల్లి భయంకర మహాసర్పములు ధనాగారములను గాంచుచుండెనని వినియుందువు—అయ్యవి నిరంత విషధరము లగుటయే గదా వాని ప్రాశస్త్యము! అట్టులే నీవును అనుక్షణమాయుధ హస్తుఁడవై యున్న

గాని నీవలన ప్రయోజనమేమి ?"

సిద్దీ మగుడ సాష్టాంగ మొనరించి కడుదైన్యముగ నిట్లనెను.—

"మహాప్రభూ ! రక్షింపుము ! ఇష్టమాయరయందుమఱచితిని—తలో ణమున నిద్రింతును—ప్రమాదవశమున—"

"ప్రమాదమా ! సేవకాధమా ! ఏమంటివి ? ఇట్టి ప్రమాదము లెన్నాయెనో !"

"అధిపా ! ఇట్టి ప్రమాదమెన్నఁడు సంభవింపలేదు—ఇదే తొలి సారి—ప్రభూ ! క్షమింపుము—రక్షింపుము !"

సేవకా ! ప్రభువు దయామయుఁడు—నిన్ను క్షమియించునులే."

ఇస్మైల్ల్లా అతనిని వానికి ధైర్యము గఱపి, సముచిత సరసంభాషణల చేసి నాథుని క్రోధ ముడుపుటకుఁ గూడఁ బ్రయత్నించెను. పాషా యిట్లనెను.—

"పినఖష్టము నిజముగ నందున్నదో లేదో చూతముగాక.— అల్లా ! ఓరి, పసరమా ! ఇదియేమి ? ఈ రుచిరాహారము లెక్కడివి ?— సారాయి కూడనా ! తెలిసె—పిడరాని యీనిగూఢ ధనాగారము విడి, చొరరాని నాయుపవనము జొచ్చి, నీవంటి సేవకాధముఁడు చూడనైన జూడరాని ప్రశస్తభోజ్య పదార్థముల నపహరించితివిగా !"

సిద్దీ యవస్థ ఎటులుండునో పాఠకులే గ్రహింపవలయును. దీనాతి దీనాననుఁడై ప్రభుపత్ని నొక్కసారి తిలకించి, మగుడ పాషా పాద ములచెంత వ్రాలెను. తురుష్కప్రభువు దండహ్యామాన మానసుఁడై అభినవజల ధరధ్వానమున నిట్లు గర్జించెను.—

"అధమాధమా ! నీ యపరాధము స్పష్టము ! అందులకు శిక్షనీకుఁ దెలియుఁగదా—అనుభవింతువుగాక !"

దల్తబను పాషా అత్యుగ్రుఁడై, మర్మితీక్షుఁడై యుండెను. ఆస్థ లంబుననే యుండెను ఇస్మైల్లా యవస్థ కడుంగడు దుర్భరమ్ముగ వర్ణనా

తీతముగ నుండెను. నాథుని శాంత పఱచుటెంతయు నసాధ్యముగ నుండెను. కావున నాకు నిస్పృహ యంకురింపగు [illegible] పఱచి మధుర మందహాసగర్భిత వదనమై మంజుల [illegible] నిట్లులనెను.—

"ప్రాణనాథా! ఈ మచ్ఛూ అంతగ ద్రోహికాఁడని భావింతును. సమాధాన మొసంగుట కవకాశ మొసంగుఁడు. ఒకవేళ, వాని కనుదిన మాహారము తెచ్చెడు నమీనా జాలిగొని ఈ రమ్యాహారము లంగూడ నేఁడు కొని తెచ్చెనేమో—"

"అట్లులగునేని అమీనాయును దత్ఫలమనుభవించుగాక!"

"ప్రాణేశ్వరా! నిజము చెప్పవలయునుగదా— ఈ స్వామిభక్తున కప్పుడపుడు నేనే మధురస మంపుచుంటి—"

"ఐన, నీవును అపరాధ మొనరించితివి! కాని, నీ యౌదార్యము అబలాజన సహజదౌర్బల్యము వ్యక్తపఱచుచున్నది. కాని, తన యంతర మెఱుంగక ఇట్టి పదార్థములు పరిగ్రహించువాఁడే ప్రధానాపరాధి. ఐనను, నీవు చెప్పుచుంటివి కాన, వానికి మరణము తప్పెను. కాని, వానినెల్లి బానిసబజారున కంపి, విక్రయింతును— ప్రభువిశ్వాసపాత్రుఁడైన యీ దుర్దినము దలంచి ఆ జన్మాంతము దుఃఖితు డగుగాక. దురాత్మా! లెమ్ము! విశ్వాసఘాతుకుఁడవై నీ కొసంగిన తాళము దుర్వినియోగ మొనర్చితివి! ఆ బీగ మిటు తెమ్ము; లెమ్ము!"

కాని, ఆ సేవకుఁడు బాధిర్యబాధితుఁడో యన, లేవఁడాయెను. అంతవఱకు భూమికి కొంచె మెత్తుగనుండిన శిరము ఆ చల్లని కటికి తాల నొరయునట్లు వ్రాలి, చచ్చినపగిది వాఁడట్టులే పడియుండెను.

"ఓరీ! మాటాడవేమి? సత్వరము తాళ మిమ్ము!"

ప్రభు వట్లు గర్జించినను, వాఁడట్టులే పడియుండెను. అంత

బిస్మిల్లా ఇట్లనెను—

“ప్రాణేశ్వరా! వినలేదా, ఏమి? ప్రభువునకు బీగ మిచ్చి వేయుమనా—నిన్ను చెప్పిన మన్నించును—నేఁగూడఁ గోరుచున్న దానను.”

అంత నమిత మందస్వరంబున సిద్ది యిట్లనెను—మహారాణీ! తాళము—తాళము పోయెను—”

మరుక్షణ ప్రభువు తోడనే భయంకరరౌద్రమూర్తియై, రక్తారుణ రాగరంజితనయనుఁడై ప్రజ్వలితానల సన్నిభనయనుఁడై తదావేశమున భూతాడన మొనరించి యిట్లు గర్జించెను—

“ఇవి యేటిమాటలు! ఓరోరి, సేవకాధమా! ఏమంటివి! హౌరా! నాతో నీఁడు ఎక్కసక్కెము లాడునాఁవేమి! అధమాధమా! మాటాడ వేమి? ఆరామమునకుఁ జూపు రహస్యకవాటతాళ మేమాయె?”

మృతప్రాయుఁడగు నా సిద్దినోటినుండి మాట వెలువడుటయే బహు కష్టముగ నుండెను. వాఁ డెట్టులో ప్రాణములు బిగియబట్టి హీనాతిహీనస్వరంబున ‘పోయె’ నని మగుడఁ బలికెను.

హాహా ఇంకనుఁ దాళఁగలఁడా? ఆగ్రహము దుర్భరంబగుడు, నాతఁడు మండిపడి మగుడ నిట్లు గర్జించెను—

“పోయెనా! తాళము పోయెనే! కాంతా! చూచితిగదా!— ఇట్టి దురాత్ముని నీవు సైరింపుమంటివి! ఎంత మోసము! ఎంత ప్రమాదము! ఇట్టి దుష్టవిశ్వాసఘాతుకునేగదా, మన మింతకాలము విశ్వసించియుంటిమి!”

కాని ప్రభుపత్ని ఏమనఁజాలును? ఆమె యవస్థమాత్రము తిన్నగ నుండెనా? తదవస్థ ప్రకటింపరాని దగుటచే మఱియు దుర్భరమై, దుస్సహమై, హృదయవిదారణకరమై యుండుటచే, నా యభాగిని ప్రత్యుత్తర మొసంగఁబోయియు విఫలయాయెను. హాహా మగుడ

నిట్లు గర్జించెను—

"దుష్టా! తాళమేమాయె? ఎందుఁబోయెను? కవాటము భద్రముగ బంధింపఁబడియున్నదా!"

"చిత్తము, దేవా!" వాఁడింక నట్టులే పడియుండెను.

"అట్లైనచో, నా తాళ మిందే యుండవలయు. ఎందో దాచి మఱచియుందువు. కాదేని, సారాయికైపున నొడలెఱుంగక ఎచ్చటేని పాఱవైచి యుందువు."

"దేవా! ఎల్లెడల బరిశోధించితిని. నేనా తాళమునకై వెదకుచుండగనే, దేవరవా రరుదెంచిరి."

"చాల వింతగ నున్నది. ఏమియు గ్రాహ్యము కాకున్నది. ఏమైనను నీవు ప్రమత్తుండవగుట తథ్యము. ఏమో! అంతయు నొక మోసము కారాదా? సేవకా! లేచి, నీగదిలోనికి సత్వరము పరువుము!"

వివిధాలోచనా బాధితుండై యట్టు లాజ్ఞాపించి, పాషా విద్యుత్ప్రభావిభాసిత కరవాలము నొరనుండి తీసెను. ఇస్మైల్డా యమిత భయాధీనయై కెవ్వున నఱచి తాఁజూచుచుండగ వానిఁ జంపరాదని ప్రార్థించెను.

"కాంతా! భయము వలదు. నాయభిమత మదిగాదు"—అని హెచ్చరించి, చెంతనున్న సిద్దీ దీర్ఘకరవాలముం గూడఁ జేఁబూని, పాషా మగుడ నిట్టులనెను—"మస్రూ! నీయాయు వీగంటతో సరి! గంటయననేల—ఈ నిమిషముతో సరి! నేనిదె పోయి తద్భయంకర కార్యరచనా సమర్థులగు కింకరులను జీరువాఁడ!"

మస్రూమాట యటుండ, ప్రభుభార్య యవస్థ వర్ణనాతీతముగ నుండెను. భయంకరానల దహ్యమాన కాంతారమువలె నామె హృదయము భగ్గుభగ్గున మండిపోవుచుండెను. ఐనను, తద్విపరీత

నయౌవనకోచిత గాంభీర్యముదాల్చి, వినమ్రుడై మోఁకరించి ఆమె
ఇట్టులనెను—

మహనీయా! భవదీయ హృదయానువర్తిని నగు నాపలుకులు
గమనింపుము. ఈసేవకుని తల మధుపానమునఁ గైపెక్కి యుండుట
సువ్యక్తము గదా. వాఁడు కృతస్మారకుఁ డగువరకు గడువొసం
గుము. ఒక్కజాము చాలు—తగు సమాధాన మొసంగునేమో
మాత్రము.”

“ప్రేయసీ! లెస్సబల్కితివి. సేవకా! వింటివా? ఒక జాము
సావకాశ మిచ్చితి—నేమగుడ నేతెంచుసరికి తగు సమాధానమొసం
గిన, నదృష్టవంతుఁడవు—లేదేని, భయంకరచాపపాశ ఖండితకంఠుఁ
డవై చత్తువు—నీ పాపిష్ఠి మృతకళేబరము బాస్ఫరసు జలచరంబుల
కాహారంబగు! తరుణీ, గమ్ము!”.

అట్లు పలికి, సవ్యాపసవ్యహస్తముల కృపాణములు దీపింప, దల్ల
బను పాషా తోడనే వెడలెను. ఎట్టి యుపాయము వారయకుండ
తాఁజూచెదనని సిద్ధి గ్రహించునట్లు భావగర్భితముగ నొక్కవీక్షణము
విద్యుత్కిరణమువలె వానిపై బఱపి, ప్రభుపత్ని యాతని ననుగ
మించెను. పాషా యాద్వారము తోడనే దిట్టముగ బంధించి, ఇట్టు
లనెను—“శయ్యాగతుఁడ గాకముందె, నాధనము సురక్షితముగ
నున్నదో, లేదో చూడవలయు.”

ఇఁక లూకాసు ఖాలీలుల సమాచార మరయవలయును. పాషా
యరుదెంచు సవ్వడి ఆలించినంతనే, వారు మాయమైరిగదా. నిజ
మందిరకుడ్యాంతరహస్య కవాటముదాసి మిత్రులచట నిలిచియుండిరి.
ఆ మెట్లు వరుస వంకరతిరిగిన కారణమున వారుపాషాకుఁ - గానరారు.
పాషా మొదలగువారుగూడ లూకాసు ఖాలీలుల కగోచరులైనను
వారి సంభాషణము స్పష్టముగ వినఁబడెను. తన తురుష్కమిత్రుని

ప్రవర్తనముండలంచి లూకాసు మఱియు మఱియు విస్మితుఁడాయెను. ఖాలీలుఁడే సమాధాన మొసంగఁబోక, చైతన్య రహిత శిలా ప్రతిమ వలె నిలిచి, సిద్దీ పాషా ఇస్మిల్డాల సంభాషణ నాకర్ణించు కార్య మున నిమగ్నుఁడాయెను. నవ్వడి ఏమైనను, పాషా గుర్తించును. కాన, నేఁ తేని యనర్థము వాటిల్లును. కాని, లూకాసుకూడ వివేక వంతుఁడగుటచే, సమిత సంభ్రమసంభరిత స్వాంతుడయ్యు నిశ్శబ్ద ముగ నుండెను.

తత్క్షణము తన ధనాగారము పరీక్షింప వలయునని పాషాయనిన పలుకులు వీనులఁ బడినంతనే, ఖాలీలుఁడు వడివడి మెట్లమలపుడాసి ఆతని చర్యనరయఁ బ్రయత్నించును. పాషా చేలయందలి మరతలుపు సమీపించి, తత్సాలాపారావద్వారము యథాస్థానమున సురక్షిత ముగ నుండెనో లేదోయని ముందుగఁ బరీక్షించెను. సిద్దీబలుకు లంత వరకు సత్యములై దాన నాప్రభువు సంతసించి, ఆప్రక్కనున్న ఇనుపచీల నొక్కెను. కంటి కగోచరమగు పరస్పర సంబంధముంటచేఁ గావలయు, దన్నికట భూస్థాపితదారు కవాటము చలించెను. పాషా యా తలుపెత్తి, వంగివంగి తదేకధ్యానముతో నందేమియో చూడఁ దొడంగెను. ఆముహూర్తముననే చెప్పరాని విపరీత దృశ్యమొండు ఖాలీలునకు గోచరించెను.

ఇస్మిల్డా పాషావెనువెంటనే యుండెను. దీపపుఁగిరణంబు లామె వదనముపై స్పష్టముగఁ బడుచుండెను. తద్దానన వీక్షణాభిరతుండగు తురుష్కయువకున కాకార్యము దాన సుకరమాయెను. ధీర యువజన హృదయాకర్షణచణనిరుపమానమధురశీతల సౌందర్య విరాజితయగు నావ్యాఘ్రంటి తత్క్షణమున ఘోరతరవికారాకార రాక్షసి చందంబునఁ దోఁచెను. సాధుహరిణ వేషధారిణియగు వ్యాఘ్రి తటిజూచి నిజ భయంకరాకృతి ధరించు భాతి నాయువతి వైఖరి కాన్పించెను.

ఆ విపరీతపుఁగాంత పెనురక్కసిలోఁతె దారుణ సంకల్పధురీణయై బాహువులుజూపి, వంగివంగి భూరంధ్రపరిశీలన కార్యనిమగ్నుఁడై యున్న తన నాథుని రయమ్మున నయ్యగాధమున బడఁద్రోయు దానివలె నుంకించెను. పాపాయవస్థ ఏమి కావలయు? మనోహారిణి యని విశ్వసించిన కామిని నిజప్రాణాపహారిణి యగునని ఆతఁడేమి యెఱుంగు? కాని, సాక్షాత్కృత మృత్యువుంబోలిన యాబోటి దుష్ట సంకల్పము గాంచినంతనే, ఖాలీలుఁడు తదవసర దుర్భరావేశమున రయంబునఁబోయి వారింప నుద్దేశించెను. కాని, అదృష్ట వశమున, పరీక్షపూర్తి యగుటచే, నందనుక వంగిన పాషా లేచుచు నిట్టులనె.—
"అల్లాదయామయుఁడు—వందనీయుఁడు—ధనము సురక్షితముగ నున్నది!"

సుందరియగు నిస్మిల్లా ఎటులు దారుణాకృతి దాల్చెనో, అట్టులే మగుడ దొంటి నిశ్చల ప్రసన్నవదనము దత్క్షణము తాల్చెను ఖాలీలుఁడు ప్రచలిత హృదయుఁ డాయెను. మలపున కవ్వలనున్న లూకాసు మాత్ర మేమియు నెఱుంగఁడు.

వల్లబను పాషా యంతనారహస్య కవాటమును భూస్థలి నెప్పటి యట్లు పొందుపఱచి, ఇట్టులనెను.—"జీవితేశ్వరీ! మదీయహృద యారామసీమ ప్రవర్ధిత మనోహర సంపుల్లకుసుమరత్నమా! భవ దీయ శయ్యాగారమునకు, బోదము, రమ్ము—నీవనినట్లు భవదురు వక్షోజతల్పుండనై హాయిగ నిద్రింతును."

దైవమా! ఎంత విపరీతము! నాథుని ప్రాణము గబళింపఁజూచు రక్కసియా, జీవితేశ్వరి? తన కాదుష్టాత్మ కతంబునఁ ప్రాపింపవల సిన ప్రాణోపద్రవమావంతేని పాషాకుఁదెలిసెనేని, తెలియకున్నను అనుమానమైనను స్ఫురించెనేని, తత్క్షణ మామెను బాస్ఫరసుజలరాశి గర్భంబున గుభాలునఁ ద్రోయించి యుండెడివాఁడు. కాని, తద

పాయమునెఱుంగని పాపా నిశ్చల సంతోషిత స్వాంతుఁడై, భార్యా సమేతుఁడై యాస్థలమునుండి తొలఁగెను.

తోడనే, ఖాలీలుఁడు తన మిత్రునిఁజూసి ప్రశ్నపదా నమీనాను గాంచుటయు, ప్రభుపత్నీ క్రీడామందిరము జొచ్చుటయు, తదంతర మాయా ప్రణయగాథయును, పాపాయరు దెంచుటచేఁ దా నామందిర మునుండి వెలువడుటయును లూకాసు తెలియఁ బలికెను. అనంతర మాతఁడిట్లు ప్రశ్నించెను.—

"మిత్రమా! ఇఁక నీకథ వినవలయు. నీచర్యలు నిగూఢములై, విస్మయజనకములై, అగమ్యములై, యున్నవి—"

"మిత్రమా! కొంతకాలము వేచియుండవలయు. నిర్మలహృదయముతో నీవింతవ్యాపారములందుఁ బాల్గొనుచుంటినని మాత్రము విశ్వసించి యుండుము. తగిన యదను చిరకాలమున రాఁగలదు. నీకపుడు సర్వము సువ్యక్తమగును."

ఖాలీలు, డాపగిది వినిశ్చిత స్వరంబునఁ బలుక, లూకాసు సముచితముగ నిట్టులనెను.—

"మిత్రమా! సహజోదార స్వభావుండవు. యుక్తాయుక్త వివేచనా సమర్థుండవు— నీకెదురాడ వాఁడఁగాను. ఆర్యా! భవదీయ కృపాతిశయముచేఁగాదే, నేను సజీవుఁడనై యుంట! భయంకర మృత్యుగహ్వరమునుండి రక్షించిన నీయుంగరము ప్రభావమెన్నఁడును మఱపునకు రాదుగదా—"

ఆ తెఱంగునఁ దన కృతజ్ఞత వెలిబుచ్చి తన మిత్రునితో నభిమానపురస్సరముగాఁ బరస్పరకరపీడన మొనరించి, తనసమాచారము జాలియుననకుఁగూడ నెఱింగింప వలదని హెచ్చరించి, ఖాలీలుఁడాతని మందిరమున కాతనిం బుచ్చెను.

తురుష్కవీరుఁ డనంతరము తన మందిరకుడ్యాంతర్గతరహస్యమార్గ

ము గప్పివైచెను. కాని, ఆతఁడు తన మందిరమునకుఁ బోక, మగుడ వెనుదిరిగి ఆసోపానములవెంబడి నడచి, సిద్దీ వెడలియుండిన యారామ ద్వారము చెంతకుఁబోయెను. అందెవ్వరును లేరు; ప్రదేశము కడు నిశ్శబ్దముగ నుండెను; తాళము తనచెంతనుండుటచే నాకవాటము సుళువుగాఁదెఱచి యల్లనఁ బరికించెను. తెల్లవాఱుచుండెను. ఆవిశాల ప్రదేశమునం దెవ్వరును లేరు. కావున నాతఁడు ద్వారమునుండి వెలువడి, కొంత దవ్వరిగి, వెనుకటిసాయంకాలమునఁ దన పరిచారకుఁడగు సాదకుఁ డొసంగిన మందసము తెఱచెను. అందుఁ జిన్న పొన్నకాయయంతటి ఫిరంగి గుండు ఒకటి ఉండెను. అందొక గుండు తన కరంబునఁబూని, బాహుబలము గొలంది విసరెను. అప్పుడది తుపాకినుండి దూఁకు లోహగోళమువలె ఱివ్వునఁబాఱి, తోఁపుకొన యందలి వృక్షపంక్తి నతిక్రమించి భూగతమైనంతనే శబ్దమాయెను. ఆధ్వని యంత అధికముగ లేకుండుటచేతను, ఆస్థలము కొంతదవ్వున నుండుట చేతను, పాషా మందిరమునందలి వారెవరును వినలేదు. ధూమపటల మొకింత చెలరేగి క్రమముగా మాయమాయెను.

ఖాలీలుఁ డావంకనే చూచుచుండ, నచ్చటి సాంద్రతరగుల్మముల చాటునుండి ముగ్గురు మనుజులు మెల్లమెల్లగ గోచరించిరి. అందు మొదటివాఁడు మనకు జిరపరిచితుఁడగు సదకుఁడు. వారి వెనుక మఱి యిరువురు నల్లని సేవకులుండిరి. వారందఱు ఖాలీలుని సమీపించి యత్యంతవినయమ్మునఁ బ్రణమిల్లిరి.

ఆసేవకులతోఁ బాటు మగుడ ఖాలీలుఁ డా రహస్యమార్గమునఁ బ్రవేశించి, సిద్దీ బంధితుఁడై యుండిన కోణపుఁ దలుపుదెఱచి, వాని నుద్దేశించి యిట్లనెను.—

"మిత్రమా! అపాయమునుండి నిన్ను రక్షింతునని చెప్పియుంటిగదా. ఇం దిట్టులే యుందువేని మరణము ధృవము. ఇక్కడ ఎంతటి చతుర

మతియైనను పాషా క్రోధమున కగునది కాదు. కావున, నిన్నొక సురక్షితప్రదేశమునకుఁ జేర్పఁగలంతిని—ఈముష్కరులు నా సేవకులు—నీవు తత్క్షణము వీరివెంటఁ బొమ్ము!"

సిద్దీ అనుమానసంభ్రమభయాధీనమానసుఁడై నిరుత్తరుఁడై చూచుచుండ, ఖలీలుఁడు మరల నిట్లనెను.—

"మిత్రమా! వెఱపుమానుము. నేను వంచకుఁడఁగానని యెఱుంగఁజాలవా? నిన్నుఁ బొలియించుటయే నాయభిప్రాయమగునేని వంచనయేల? సాయుధులగు నల్వురము నిరాయుధుఁడవగు నిన్ను క్షణమునఁ బొలియింపఁజాలమా? కావున, అనవసరకాలయాపన మొనరింపక వీరి వెంటఁ బొమ్ము. నీవు బందీవై యుందువు—ఆ విషయము నిప్పుడే స్పష్టీకరింతును. ఐనను, ప్రాణభయము మాత్రము లేదు—సమయమగునపుడు నే నడుగు ప్రశ్నలకు సమాధాన మీయవలదు. పొమ్ము!"

సిద్దీ మందుఁడుగాఁడు. ఖలీలుఁ డుదారవంతుఁడని యాతఁ డెఱుంగును. ఏమైనను, పాషా గృహంబున నుండిన, మరణము తథ్యము. ఖలీలుని ప్రవర్తన మనుమానాస్పదముగనే యుండినను, మృత్యుమందిరము వీడుట వివేకముగదా. కావున వాఁడు సమ్మతించెను. తోడనే, వారెందఱు నావలకుఁ బోయిరి. కొంత దవ్వరగి, సదకుని శ్రవణంబున నేమియో పలికి ఖలీలుఁడు రయంబున వెనుదిరిగి మరల దన్మందిరాంతర్గతుఁ డాయెను. ఆతఁ డాతలుపు భద్రముగ వైచి తన మందిరము జొచ్చి, తత్క్షణము శయ్యాగతుఁ డాయెను.

పై విషయము జరిగిన యొక గంటకు ఇస్మైల్లా శయ్యనుండి లేచెను. ఆమాయలాడి ఎట్లు నిద్రింపఁగలదు? పాషా గాఢనిద్రాపరుఁడై యుండెను. ఆతఁ డంతలో మేల్కొనువాఁడు గాఁడని యెఱింగినదగు

టచే నా కాంత తల్పము డిగ్గి ముసుగమలు తెర సడలించి, తత్సమీప సోపానములను వడివడి గడచి, తన నాథుఁడు సిద్దీని బంధించిన గది చెంతకుఁ బోయెను. తురుష్కప్రభువు వైచిన గడియ గట్టిముగ నట్టులే యుండెను. భారవంతమగు నాదండము మెల్లగ దీసి, తలుపు తెఱచి హృదయావేగ మొకింత యడంచి, హీనస్వరమున వడివడి నిట్టులనెను.—

"మత్ప్రియ సేవకా! మస్రూ! రమ్ము! నన్నమితవిశ్వాసముతోఁ గొల్చిన నిన్ను విడనాడుదునా; సత్వరము రమ్ము!"

మస్రూపైకి రాఁడాయెను—వచ్చు నవ్వడియైనఁ గాదాయెను! ఎట్టులగును? కాని, ప్రభుభార్య ఏమియు నెఱుంగదుగదా. కాన వాఁడు నిద్రించియుండునని యెంచి ఆ కాంతయందు జొచ్చెను. ఆమె విస్మయ మెట్లు వర్ణింపనగును! సిద్దీ కానరాఁడు! వాఁ డేమాయెను! వానినందు పాషా బంధించుట ఆమె కన్నులార గాంచి యుండెను. గడియ యథాస్థానమున నమరియుండెను. ఐనను, సిద్దీ కానరాఁడేమి? ఒకవేళ, దన పరిచారిక అమీనా వానిని దప్పించి యుండునా? ఎట్టులు? ఆ విషయ మామెకుఁ దెలియుట కవకాశము లేదే! మఱియు, నామె అందే తెంచుటయు నసంభవము! ఏమన, దన మందిరమునందలి మార్గముగాక మఱియొక్కటియే యుండెను. అయ్యది ఖాలీలుని మందిరమునందలి రహస్యద్వారము. కావున నటు పోవుటయు నసంభవము. విచారించి చూడ, నా కాంతకీ యూహా స్ఫురించెను. తన పరిచారిక వద్ద తాళము గలదుగదా— తత్సాహాయ్యమున నారామమునుండి యందుఁ బ్రవేశించి సిద్దీని విడిచి యుండననగును. కాని, అదియు నసాధ్యము. సిద్దీ యాకస్మికముగాఁ బట్టువడి బంధింపఁబడెను—ఆవిషయము అమీనా కెట్లు తెలియును! తెలియుట అసాధ్యము. ఐన, వాఁడేమాయెను; ఏమియుఁ

దోపఁకుండెను.

ఏకారణము గానరాని కారణమున నిస్మిల్లా చిత్తమమిత భయాధీనమాయెను. ఘోరాకారములగు భూతములుఁ సుప్తమానవుల సమాంశ మెత్తికొని పోవునని ప్రభ్వి యప్పుడప్పు డాలించుచుండెను. ఆగాధలిపుడు స్మరణకువచ్చెను. ఆహా! ఎంత ప్రమాదము! ఆదయ్యము తనకిపుడు ప్రత్యక్షమగు నేమోయని ఆకామిని ప్రకంపిత హృదయయై ప్రస్వేదార్ద్రశరీరయై, ప్రచలితనయనయై అందెల్లఁ గలయఁ జూచెను. దుర్భరహృదయావేగము సహింపఁజాలక, దుస్సహాశిరో వేదమునకుఁ దాళఁజాలక, నిలుచుటకైన నోపికచాలక, అచటిగోడ నామె యాశ్రయించెను. తదుత్తర నిమేషముననే మగుడ ధైర్యధుర్యయై చింతింప నమీనాయే కావలయునని ఇస్మిల్లా భావించెను. ఆమె తోడనే ఆతలుపుమూసి, గడియ గూడ నెప్పటి యట్లువైచి, ఇట్లు చింతించెను.—
"అమీనాయే సిద్దీనిఁ దప్పించి యుండునేని, ఏరికి నే యపాయము రాకుండ సముచిత సమాధాన మొసంగుటకు గూడ సిద్ధముగ నుండును."

తోడనే ఇస్మిల్లా తన శయ్యాగారమునకు మగిడి, యథాప్రకారము తన మగనిప్రక్క నల్లనమేను జేర్చెను. వివిధ తీవ్రాలోచనానలతప్తమగు నామె చిత్తమునకు నిద్దురమాత్రము రాకుండెను. అట్లు కొంతకాల మగుడు, పాషామేల్కాంచి, ఉదయకాల్య కరణీయములు తీఱునంతనే తాను మస్నూను గాంతుననియు, వాఁడు తగిన సమాధాన మొసంగఁడేని తత్ఫలము గుడుచుననియు పలికి వెడలెను.

పాషా నిష్క్రమమామె హృదయభారము దొలంగించెను. తత్క్షణమామె అమీనాను రావించెను. పరిచారిక గోచరించినంతనే "నీవు సిద్దీని జెఱనుండి తప్పించితివా?" యని తటాలునఁ బ్రశ్నించెను.

అమీనా ఆ ప్రశ్న వినినంతనే బ్రమాన్పడెను. విషయమేమియు

నెఱుంగని దాసి యట్లు భ్రమాన్వడుట సహజముగదా. ఇస్మిల్డా బిగ్గరగనే యిట్టులనుకొనెను.—

"ఆహా! నాయూహయే నిజముగాఁబోలు! భూతమేకావలయు. ఆ 'యెబ్లిసు' అనుచరులలోని భూత మొకండు—"

తనదొరసాని ఆకస్మికముగా నేదారుణకారణముననో మతిభ్రమణము గాంచి యుండునని యెంచి, దాసి సాభిప్రాయముగా నిట్టులనెను.—"దేవీ! ఏమంటివి? నీ యభిప్రాయ మేమి? నిశ్చలచిత్తవు గమ్ము."

ఇస్మిల్డా తోడనే జరిగిన దారుణవిపరీతోదంతము తెలియఁబఱచెను: దురంతభయసంభ్రమాకులంబున సమీనా ఆలించెను. ప్రభ్వీకంటె దాసికి దయ్యములపై భయవిశ్వాసములు మెండు. పెక్కండ్రు దురదృష్టవంతులు నిరాశావేశమున భూతనాయకునకు వశులై, తమ ఆత్మలను గోల్పోవుట కొడఁబడి ప్రకృతాపాయమునుండి తప్పించుకొందురని వినిన కథ లిపుడు తలంపునకు వచ్చెను. అట్టులే, మరణాపాయమునకుఁ జొల్పడిన సిద్దీయును భూతరాజును ప్రసన్నుని నొనరించుకొని, ఎవరికిఁ గానరాకుండ బాఱియుండునని ఆమె విశ్వసించెను.—

"దేవీ! తొల్లి 'సులేమాను' అను ప్రసిద్ధపురుష పుంగవుడు చాల భూతములను బట్టి తామ్రఘటములందు బంధించి, సముద్రగర్భమున నుంచెనట. ఆ భూతములు తా మొనరించిన దౌష్ట్యముల ననుసరించి తగు కాల మట్టులు బంధితములై యుండును. తన దురదృష్టవశమున కొన్నింటి భూతముల శిక్షానుభవము పూర్తిఆయెను. అట్టి పిశాచభాండములు సముద్రోదరము నుండి పైకి లేచును. అయ్యవి క్రమముగా నిర్జనద్వీపములం జేరియచట శిలాభగ్నములగును. భూతములకు దోడనే స్వేచ్ఛయులవడును. దేవీ! చెప్పుటకు నోరాడదుగాని అట్టి భయంకరభూత మొకటి యరుదెంచి యుండును —సిద్దీ దాని

యధీనమై యుండును—భూతమేల కొంపోవలయునో—తలంపఁ జాలను—తలంచినంతమాత్రమున శరీర మా పాదమస్తకము వడంకు చున్నది—"

భయవిహ్వలయై పరిచారిక నోటినుండి మాట వెలువడుట బహు కష్టసాధ్యముగ నుండెను. కాని, వివిధాలోచనా బాధితయగు ప్రభు పత్ని తదాలాపము లాలించుటలేదు. భూతాదులను గేవలము విశ్వ సింపని ప్రౌఢజ్ఞ కాకున్నను, అపార లౌకిక జ్ఞానము గలదగుటచే నామె అమీనావలె నా విపరీతము భూతప్రభావమని విశ్వసింప జాలక కడుంగడు జింతింపఁ దొడంగెను. చిత్తమునం దనేకాలోచ నలు నడివడి బాఱుచుండెను. ఆలోచించు గొలంది ఆమె మానసము దహించుకొని పోవుచుండెను. కావున, నమీనా యసంబద్ధాలాపము లామె వీనులఁ జొరలేదు. ఎంత యాలోచించినను సిద్ధీ యంతర్హితుం డగుట కెద్దియేని కారణముండ వలయుననియే తోఁప దొడంగెను. కాని, ఆ కారణమెద్ది? కర్త యెవ్వఁడు? అదియే దుర్గ్రాహ్యమై, తత్కా రణమునఁ గడుంగడు బాధాకరమై యుండెను.

అమీనా యింకను భూతముల గాథలను దలఁచి తలఁచి ఏమే మియో ప్రలాపించుచుండెను. వృథాలోచనములతోఁ గాలహరణ మొనరింపఁజాలని ఇస్మీల్లా దాసిని వారించి ఇట్లనెను.

"అమీనా! నీపిచ్చి మాటలఁ జాలించి నాకు వస్త్రధారణ మొన డింపుము—పాషా ఇప్పుడే అరుదెంచువాఁడు—ఈరహస్య మింక దాగనేరదుగదా—మనమప్రమత్తతతో సిద్ధముగ నుండవలయు— నీవు వెలవెలవాఱక నిశ్చలముగ నుండవలయు సుమా—"

"దేవీ! ముందీపై పరిత్యాము గుఱించి నీయభిప్రాయ మేమియో తెల్పుము—నాయుహాయే సమంజసముగదా?—"

అట్లు వదరు దాసిపై భావగర్భిత తీక్షణ వీక్షణము బఱపిఁ ప్రభు

పత్ని ఇట్టులనెను—

"అమీనా! అట్టులైన, ధన్యులమే—దండించి యదార్థము చెప్పింపఁజాలు దిట్టరులకుఁ జిక్కకుండ వాఁడు నీవనునట్టులు నిక్కముగ భూతాధీనుఁడే యగునేని అదృష్ట—హా! పాషా యరుదెంచు వాఁడు! భద్రము!"

పాషా నిజముగనే ప్రవేశించెను. కృష్ణాంగులగు బానిస లిర్వురా వెంటనుండిరి. ఆతఁడిట్టులనెను—

"ప్రాణప్రియా! నా వెంట నరుదెంతువా? లేయి నీవు కాంచి యుండుటచే—"

ఆతని వారించి, తన మగని వచింపఁజాలు సహజమోహాన వీక్షణంబు బరపి, ఆమె యిట్టులనెను—

"నిజము, నాథా! మస్రూ యొనరించిన తప్పిదములఁ గాంచియుండును. వాఁడుసారాయి మైకముచే నుచితసమాధాన మొసంగఁజాలక పోయెనేమోయని జాలివహించి, కొంత గడువొసంగ మంటిని. వాఁడొకవేళ దగిన సమాధాన మీయఁడేని, తగిన ఫలమనుభవించుగాక. వివేకవంతుఁడవు న్యాయపద్ధైక తత్పరుడవు ఉచితదండన విధింతువు గాక—నేనొక్క పల్కైన నాడుదానఁగాను."

తన భార్య ఆ తెఱంగునఁ బ్రశంసించినంతనే, ప్రభువు మానసము పొంగెను—

"ప్రేయసీ! పోదము, రమ్ము. అమీనా! యుక్తాయుక్తము లెఱింగినదానవు—నీవును రాఁదగును—తన యన్నముదిను సేవకుల యెడల మీ ప్రభువెట్లు మెలంగునో చూతువుగాక. మస్రూ సంతృప్తికరమగు సమాధాన మొసంగునేని, తప్పక మన్నింతునని నేనిదె బాసచేయువాఁడను. కాని నా తాళము కానరాకుండుటకుఁ గారణమేమియో చెప్పఁడేని, వాని కంఠముతోడనే చాపపాశాలంకృత

మగును!"

ప్రభుసేవకుఁడు నిక్కముగ నొక భయంకరపాశము దాల్చి యుండెను. పాషా సాభిప్రాయముగా నటు దిలకించి, తోడనే మొగ ములు తెరవంకఁబోయెను. అదియొక సాధారణ కృత్యమువలె నమీనా మెలంగగోరి నిశ్చల చిత్తయై తానే యా తెర తెఱచి ప్రభువునకు మార్గము చేసెను. మనసు మఱుఁగుపఱచి మెలంగు మిథ్యాప్రవర్తన మున నసాధారణధీశాలినియగు నిస్మిల్లానదసము గాంతురేని, ఆమె దుర్భరహృదయ సంక్షోభము నెవ్వరు నరయఁ జాలరు.

పాషా యారహస్యద్వారము నతిక్రమించి, దర్పమొప్ప నడుచుచు సగర్వముగ నిట్టులనెను.— "నేనొనరించిన సమయము మఱవలేదు. దయార్ద్రచిత్తుఁడనై, న్యాయతత్పరుఁడనై గూడ నుండ, జాలుదు. భగవంతుని కృపాతిశయముచే నింతవఱకు నేనెవ్వరిని హింసించి యెఱుంగను—అనుచిత దాక్షిణ్యముగూడ వహించియెఱుంగను. నేనెల్లపుడు లోకోత్తర మధ్యపథం బనుగమింతును—కావున నే, నేను జననందోహ శ్లాఘాపాత్రుఁడనైతి!"

"ప్రాణేశ్వరా! సందేహమేమి? వివేకోదార న్యాయగుణంబులకు నీవు కేవల మాదర్శప్రాయుఁడవని లోకమంతయు నుతించును."

అట్లు పలుకు తన భార్యనుగాంచి పాషా మందహాస మొనరించెను. సిద్దీని బంధించిన చెఱ యంతలో సమీపించుటచే నాతఁడట నిలిచి యాజ్ఞాపింప, నొక సేవకుఁడు బిఱానఁబోయి, ఆ కార గడియ దీసి, తలుపుత్రోసెను, సిద్దీయవ్వలకు రాకుండుటచే, పాషా యిట్లు సంబోధించెను.—

"మిత్రమా! వెలికి రమ్ము! నీప్రభుస కేమి సమాధాన మిత్తువో చెప్పుము."

"ఔను. ఆలసింపకుము! ఈసారి నన్నెంత దైన్యముగఁ జూచినను

నిరర్థకముసుమా!"

ఇస్మిల్లా యట్లు హెచ్చరింప, అమీనా మెల్లగ—వారందఱకు వినఁబడునట్టులే—నిట్టులనెను.— "విశ్వాసహీనుఁడు! రాఁడేమి? వచ్చి, పూజ్యుఁడగు ప్రభుపాదములపైఁ బడఁడేమి?"

"ఏమీ! ఈ సేవకాధముఁడు— ఈ శ్వానము— రాఁడేమి? ఎంతటి మొండితనము! ఇంత నిర్లక్ష్యమా! నన్నింతగ పరాభవించునే! మఱియొక క్షణ మాలసించునేని, ఏమి చేయింతునో చూడుడు! అరే, మస్రూ! తత్క్షణము రావలయు!"

క్రుద్ధుఁడై పాషా యట్లు గర్జించినను, సిద్దీ బయల్పడఁడాయెను! ఎట్లు బయల్పడును? వాఁడందుండినగదా, బయల్పడుట! అజ్ఞుఁడగు పాషా ఎంత ఆగ్రహించినను, ఎంత గర్జించినను, ఎంత ఆజ్ఞాపించినను, ప్రయోజనమేమి? ఇఁక నాతఁడు సహింపజాలక, తన కింకరుల నుద్దేశించి, రయంబునఁబాఱి యాదురాత్ము సిద్దీఁగొని రావలయునని సక్రోధముగ నాజ్ఞాపించెను.

సేవకులు శరవేగమునఁబోయిరి. కాని, వారు సత్వరము సిద్దీని ముందు కీడ్చుటకుమాఱుగ విమూఢవిస్మయాతిరేకమున డిల్లవడి యుండుటఁగాంచి, పాషా కృపాణధారియై రయంబున నందుఁజొచ్చెను. ఆతఁడును వారివలెనే విపరీత సంభ్రమాకులుండాయెను. పాపమా ప్రభువట్టి ఱిచ్చపాటెన్నఁ డెఱుంగఁడు. తదవస్థ కడువిపరీతముగ, అభూతముగ, కడుంగడు హాస్యాస్పదముగ, కేవలము వర్ణనాతీతముగ నుండెను. నిజకరవాలము చేతినుండిజాఱ, ఆకర్ణాంత విశాలాయత వక్త్రుఁడై, విశాల తర నయనుఁడై, శూన్యవీక్షణుఁడై దల్లడను పాషా వాగ్బంధితుఁడై యుంటఁగాంచి, ఇస్మిల్లా అమీనాలు ఏమియు నెఱుంగనివారివోలె, వారును జయ్యనందుఁజొరఁబడిరి. తదవసరోచితమరంత విస్మయసూచకముగా నిస్మిల్లా ఇట్టులఱచెను.— "ఆహా!

ఇయ్యది భూతప్రభావము కావలయు!"

దేవికిందగు దాసియగు నమీనా "ఆ! దుష్టభూతము!" అని తాళము వైచెను

"కాదు—మహాద్రోహము!" అని పాషా భయంకరజలధరము భాతి గర్జించి, జారిన కైదువు తటాలునఁజేబూని, కోపభీషణాకారుఁడై గహ్వరమునుండి వెలువడు వ్యాఘ్రమువలె బయటకు వచ్చెను. అతని భుజాదండము నల్లనఁబట్టి వెనువెంట వడివడినడచుచు నిస్మిల్లా ఇట్టులనెను. "ప్రాణనాథా! ఏమంటివి? ద్రోహమా! ఎవ్వరు? ఎవరిని అనుమానింతువు? ఏమని యనుమానింతువు?"

ఆప్రశ్నములు వీనులఁబడినంతనే పాషా కృతస్మారకుఁడై, చటుకున నిలిచి సంభ్రమావేశమున మందుని పగిది దిలకించుచు నిట్టులనుకొనెను—"దైవమా! ఎవ్వరొనరించియుందురో ఏమియుఁదోపఁకున్నది!"

పాషా మఱి మాటాడలేదు. తోడనేఁ ఆమెట్లు డిగ్గి, ఆరామ ద్వారము భద్రముగ బంధీకృతమై యుంటఁగాంచి సంతసించి, ఈ రహస్య మన్యులకుఁ దెలియరాదని సేవకులకు హెచ్చరించి, పాషా పంపివైచెను. గంభీరాననయై చెంతనుండి పత్ని నాథుని వదనము నరయుచునే యుండెను. తాను భయానుమానబాధితయై కుందవలసిన యవసరము లేదని ఆమె గ్రహించెను. మఱియు నే యనుమానమున కవసరములేని విధంబున పాషాయే ఇట్టులనెను—"మత్ప్రియపత్నీ! ఈయుదంతము దుర్గ్రాహ్యమై, కడు బాధాకరముగ నున్నది. కాని మన ధనము సురక్షితముగ నున్నదో లేదో అరయుదము రమ్ము."

పాషా తోడనే మఱితలుపు సడలించి అవనతశిరస్కుఁడై తద్గృహాంతర్భాగములం దిలకింపఁ దొడంగెను. అట్టి మహాముహూర్తముననే తన నాథునందుఁ బడఁద్రోసి ఆజారిణి హాయిగనుండ నాసించినను,

సాధ్యముగాకపోయెను. ఒక్కనిముసము క్రిందటనే ఆస్థలంబునుండి వెడలిన బానిస లిర్వురును ప్రభుప్రభ్వులను గాంచియుండిరి. కావున, పాషా ఆకస్మికముగ సంతరించునేని, ఆతని కాంత అనుమానము నకుఁ దప్పక పాల్పడును. ఆకారణముననే, ఇస్మిల్లా దురాలోచనా యత్తచిత్తయయ్యు, సాహసింపఁజాలక, మిన్నకుండెను. మఱియు ఆసేవకు లిరువురే ఆమె యధీనులు గారని మన మెఱుంగవలయును.

"మన నిక్షేపము సురక్షితము!" అట్లు పలుకు పాషా లేచి తద్రహస్యకవాటము యథావిధంబున సమర్చి బిగ్గఱగనే ఇట్టు లను కొనెను—"మస్రూరు ఇట్లు మాయమగుట కొక్కటే కారణము కావలయును. ఈయువకులు—ముఖ్యముగా నిరువురు—విడిసియున్న మందిరకుడ్యములు రహస్యకవాట నిర్మితములై—"

ఆ పలుకులు వినఁబడినంతనే ప్రభుపత్ని మిన్నకుండఁజాలక పోయెను. ప్రభువు తద్విషయపరిశీలనమునకుఁ గడంగినచోఁ దన గుట్టు బట్టబయలగునను భయము హృదయమును దహింప, నాకామిని నాథుని వారించి రయంబున నిట్టు లనెను—"మఱియు, నాథా! మస్రూరును విడిచిపుచ్చుట వారి కేమిప్రయోజనము?"

"నిజము; ఈయువకులందఱును సత్పురుషులు, ధైర్యశాలులు, ఉదారమనస్కులు—"

"సందేహమేమి! ప్రభూ! కావున, గతవైపరీత్యము గుఱించియిఁక సంస్మరింపవలదని ప్రార్థించుదాన; తదాలోచనంబున బాధనొందక, పూర్తిగ మఱచిపొండు."

కాని, దత్తబనుపాషా ఇతికర్తవ్యతావిమూఢునివోలెఁ గాన్పించెను; ఏమన, జరిగిన యుదంత మాతని విచారవిహ్వలస్వాంతు నొనరించెను. అంత, ప్రభుపత్ని యుక్తిప్రాగల్భ్యములు ద్విగుణమైనదశాధిక మాయెను, ఆకామిని సహజమందహాసమంజులాలాపాది సరసంపు

మీరును రావలయు. మీయునికివలన మద్గృహము కళంకితము గాకుండ నింతకాల మెట్లు మెలంగితిరో, ఇప్పుడు నట్లులే మెలఁగ వలయు; మీతో బహిరంగముగ బాంధవ్యము నెఱపువఱకు నిట్టి మిథ్యాప్రవర్తనము తప్పదు గదా. నాకో, కాటు మీరును నౌకారోహణ మొనరింపలేరు, నేనవలనే వినోదార్థము జలరాశిపై విహారము సల్పు నాయాజ్ఞనుబడయ నవకాశింతును. కావున, మీరు పాకద్వారంబున వెలువడి, ఒక్కింత దవ్వుగఁబోయి, తీరమున వేచి యుండుఁడు. మే మచిరకాలమున నరుదెంచి మిమ్ము నావపైఁ జేర్పఁ గలము. ఒరులెవ్వరు చూచినను, నష్టములేదు."

ఖాలీలాదులు సమ్మతింప పాషా నిష్క్రమించెను. ఉదయభోజన మారగించి మిత్రులు మువ్వురు పాకద్వారమునుండియే మందిరము వీడి, ఖాలీలుచే విసరిన గుండుపడిన స్థలమునకు నడుమ నున్న క్షేత్రము బ్రవేశించిరి. తోడనే, తురుష్కయువకుఁ డిట్లనెను—

"మిత్రులారా! నాకు రెండు నిముసములు సెలవొసంగుఁడు. నన్నేమియుఁ బ్రశ్నింపవలదు. నాచర్య లెప్పుడు నిగూఢములై యుండునని యెఱుంగుదురు గదా—ఐనను, నాయూహ సత్పథంబు ననే పోవుననియు మీ రెఱుంగుదురు. మీరు మెల్లగ సాగుఁడు, మీరు పాషా నౌకారూఢులగు స్థలంబు జేరకమున్నె కలసికొందును."

ఖాలీలు, స్వభావము నెఱింగి విధేయులై వర్తించుట కలవడిన గ్రీకు యువకులు సహజముగా సమ్మతించి మందగమనంబునఁ బోసాగిరి. ఖాలీలుఁ డచటనే నిలిచి, తన మిత్రులు దృష్టిపాతమునకు వెలియై నంతనే తత్సమీపవనము రయమున జొచ్చి వడిగాఁ బోయెను. ఆసమయమున నాతోఁపు కొనయందలి వృక్షపంక్తియందుఁ గల కల శబ్దమాయెను—ఎవ్వరో తక్కుచునడచిన సవ్వడికూడనాయెను. తత్క్షణ మొకవ్యక్తియు గోచరించెను. ఆవ్యక్తి ఖాలీలుని పరిచారకుఁ డగు

సదకుండే!

తన సేవకుం డేలనో వైవర్ణ్యముగనుండెనని ఖలీలుండు చూచినంతనే గుర్తించెను. సదకుండు తన స్వామిని గాంచి నంతనే యథోచిత వినయపూరిత ప్రణామ మాచరించెను. వాని వదన మింకను అట్టులే డిల్లవడి భయాక్రాంతమై యుండెను—

"సదకా! దుర్వార్తధూమ్రవర్ణుండవై యరుదెంచితివా యేమి? మదీయజనకుండు—సోదరులు—"

దుర్భరాందోళన విహ్వలాయమాన మానసుండై యాపగిది వడి వడి ప్రశ్నించు ఖలీలుని గాంచి సదకు డిట్టులనెను.—

"దేవా! వారలందఱు క్షేమమే. కాని—"

"ఏమా? సత్వర మెఱింగింపుము! ఇంతే యాలస్యమేల! కలవర మేల! నీవియ మపథ్యముగ నుండిన నంతమాత్రకే— ఇంతమాత్ర మున నిన్నెన్నడైన హింసించి యుంటినా!"

"దయామయా!" అని యమంద వినయాభిమానపూరిత స్వరం బున సంబోధించి, నమస్కరించి, సదకు డిట్టులనెను.—

ప్రభువతంసమా! నీవు సదా దయామయుండవు. ఐనను, నీవు సహింపనేరని వైపరీత్యము సంభవమాయెను—దేవా—అకట్టీ—!

"అప్రహూ! ఏం—నాం జాదుర్గమున బంధితుండై యుండలేదా?"

పరిచారకుండు నోరు విచ్చి మాటాడజాలక ఇట్టు గొణఁగెను.—

"దేవా! అట్టులైన, నాకింత భయంబేల? వాడు తప్పించు కొనెను."

అగ్రహావేశమున వదన మెఱ్ఱబాఱ తురుష్కయువకు డిట్టులనెను.

"ఓరీ సేవకా! ఇందులకు నీప్రమత్తతయే కారణమగునేని—"

"దేవా! రక్షింపుము! అల్లా యెఱుంగు—ఇందు నా నేర మేమియు లేదు. కరుణాసముద్రుండగు ప్రభునాజ్ఞ నా ప్రాణమ్ములైన

లెక్కసేయక నిర్వర్తింతు గాని, అన్యథాప్రవర్తింపఁ గలనా?"

"సదకా! నీవు నిక్కముగ ప్రభు విశ్వాసార్హుఁడవు—నే నెఱుంగుదు. లెమ్ము. ఈనాఁటి విశేషమ్ము లెట్టివో సవిస్తరముగఁ దెల్పుము."

"దేవా! నేనును నాతోడి కావలివారును మున్నూరును జుట్టి పోవుచుంటిమి. వాఁడు దృఢపాశబద్ధుఁడై యుండెనని యెంచి మే మెల్లరము నిర్భయముగ నుంటిమి. కొంత దవ్వరిగిన యనంతర మాకస్మికముగ వాఁ డాపగ్గములను ద్రుటుక్కునఁ ద్రెంచివైచి, ప్రమాదవశమున నాపథంబునఁ బడియున్న పెనుబడియం జేఁబూనెను. ఆముహూర్తముననే, మాకరవాలములు నారించితిమి. కాని, మాప్రయత్నము వ్యర్థమాయెను. ఆ సైతాను ననాప్రభూతబలాఢ్యునివలె విజృంభించి మాపైఁ బడెను. క్షణమాత్ర కాలమున నా సహచరులందఱు మరంత దండతాడనంబుల మూర్ఛిల్లిరి. నేనును ప్రారంభముగ నీదెబ్బ తినక తప్పినది కాదు."

అట్లు పలుకుచు సదకుఁడు తన కపాలమునఁ గుడి కణతపైఁ దగిలిన ఘోరఘాతముం జూపెను. మిగిలిన సేవకు లేమైరని ప్రశ్నింప, వాఁడు మగుడ నిట్లు పలికెను.—

"మూర్ఛిల్లిన మేమందరము దెప్పిరిల్లినంతనే రాజధానికిం బోయి, నగర రక్షకాధికారులకా విషయము దెలిపి, తోడనే, మేము వర్ణించిన సిద్ధి యెచ్చటి గోచరించినను బట్టుటకై చారులను నలుదిక్కుల నత్వరమంప వలయునని చెప్పితిమి. ఆ కార్యమట్టులగుచు, మఱేమైన నవసరముండునని నీకడకరుదెంచితిమి. దేవా! ఏమి సెలవు?"

"సేవకా! ప్రమత్తుండవై యుంటివని నిన్ను నిందింపకున్నను, మందవని యనకుండుట మాత్రము అసాధ్యముగనున్నది. ఏమి? నిశితకరవాల ధారులగు నల్వురు కేవల మొకని దండమాత్ర సాహాయ్యమున

ఖులు నలుపదొడంగెను.

నౌక యొకగంట యానమొనరించి అన్నశీతీరము సమీపించెను. ఆప్రదేశము మిగుల మనోహరమై వర్ణనాతీతముగ నుండెను. మున్ను స్తు గాంచని ఖాలీలాంటి యువక లనుగాంచిన ...చి వదనుడై ప్రశంసించెను. హాహా ప్రసన్నచిత్తుండగుటచే నౌకాధిపతికి మఱియు దగ్గఱగఁ బోవలయునని ఆజ్ఞాపించెను. ఖాలీలావలు మఱియు ముద మందిరి. ఆ దృశ్యము నిరుపమాన సౌందర్య వైభవ సమన్వితమై యుండెను. నానావిధ వృక్షనిలయములగు నారామములు హాలుగ నీటినటిక విస్తరిల్లి నయనపర్వ మొనరించుచుండెను. భోగవరాదు లగు మహమ్మదీయ ప్రభువుల కేర్పఱిచిన ఆరామగృహములు, క్రీడా మందిరములు, వినోదమంటపములును నిరుపమాన సౌందర్య వైభవ ముతో నలరారుచుండెను ఆ దృశ్యము నిక్కముగ రమణీయముగ నుండెను. మనోహర హరితవర్ణ రాజితములగు తరుపత్రములు సము జ్జ్వల సూర్యాతపము కతంబున సుందరతర గాఢతరరాగమున నొప్పా రెను. తదంతరస్థలములు సువర్ణమాణిక్యములవలె మెరయుచుండెను. చంద్రకాంత శిలానిర్మిత జలస్తంభములు స్ఫటికజలంబుల మనోహర ముగ నెగజిమ్ముచుండెను. మఱియు, ప్రకాశమాన శిలామార్గంబులు, నవవికసితకుసుమగుళుచ్ఛ విరాజితారామములు, ప్రకాశమాన ధవళ సౌధములు, తన్మందిరవిరచితసుందర చిత్రరములు, తచ్ఛిఖరాలంకృత స్వర్ణమయ బాలచంద్రులును దర్శనీయములై వర్ణనాతీతములై యుండెను.

హాహానౌక యంతనొక చిన్ననదీ ముఖంబునఁబడి, నానావిధ వృక్షసంకీర్ణములగు నారామములు పెక్కింటిని దాటి చుట్టితజ్జలములు ప్రవ హించు ప్రదేశము సమీపింపఁ జొచ్చెను. ఆచుట్టును రుమేలియా దేశపు వనములు దట్టముగఁ బెరిగి యుండెను. ఏఁబది గజములు వెడ

ల్పుగల ఆప్రవాహము క్రమముగా మఱియు మఱియు సన్నగిలెను. ఇరు కెలంకులనుండు సమున్నత సౌంగరభవనములు గాంచి, అనిర్వచనీయ ప్రకృతి సౌందర్యమున కలరి, నారంగాది ఫలవృక్ష నిబిడమై కేతల తీరమై యొప్పుతావున పట్టున పాషా తన పడవ నాపించెను. పడవవాండ్రు తోడనే నేలకుదిగ్గి దానినొకను ఆసమీప వృక్షమునకుఁ గట్టిరి. అనంతరము సేవకులు వివిధరుచిర ఫలాహారములను ప్రభువు ముంగల బెట్టిరి.

కాంతలును ఖాలీలాదియువకులునుగూడ చల్లని షర్బతు గ్రోలు దొత్తు త్రావఁబోయిరి. పాషాయటులుగాక ప్రసిద్ధమగు ఫ్రెంచి మధువు సేవించి సేద దేఱెను.

ఖాలీలుఁడు షర్బతు త్రావఁబోవు సమయమున మోహమెత్తి పరికింప, నెదుటంగల పొదలచాటున నెద్దియో సవ్వడి ఆయెను. విస్మయాతిరేకమున నాతఁడు 'హా' యని, పానపాత్రము నట్టె వోఁద్రోచి నౌకనుండి తత్‌క్షణము లంఘించి, ఆ పొదలయందుఁ బడి అదృశ్యుఁడాయెను. ఏమియు నెఱుంగని పాషా మొదలగువారు సంభ్రమాశ్చర్య మగ్నమానసులై పరస్పర ముఖవిలోకన మొనరించిరి.

ఆ తెఱంగున మాయమైన ఖలీలుఁడు కృపాణధారియై అనిమిష నయనుఁడై వడివడి నందందుఁ బరిభ్రమింపఁ దొడంగెను. అతఁడు వెదుకబోయిన పదార్థము చిక్కినట్లు కానరాదు. ఆతని వదనము గాంతుమేని, ఆగ్రహాధీనమై తీక్ష్ణముగ నుండెను. అన్వేషణాకార్య నిమగ్నుఁడైన ఖాలీలుఁ డాకస్మికముగా నొక వింతరంగము బ్రవేశించెను.

అచటి ప్రదేశములలో నొండు సాంద్రతరు గుల్మలతాపరివృతమై యుండెను. తదంతరారామము రెండువందల గజములు వెడల్పు గలిగి యుండెను. వివిధగాఢతరవర్ణములతో నలరారు పూలచెట్లు

చక్కగ వరుసలు తీర్చియుండెను. చంద్రకాంత జలయంత్రంబుల నుండి వెలువడు నవిరళ విమలతోయములు మనోహరముగ నృత్యము సల్పుచుండెను. పక్షిజాతిలోనెల్ల సుందరతములగు మయూరములు వివిధవర్ణవిరాజితములై వైభవనిలయములై యొప్పు పింఛములు విప్పి సగర్వముగఁ దిరుగాడుచుండెను. శుకరాజములు లెక్కకు మీఱి వృక్షశాఖల నలంకరించియుండెను. కాని, ఇయ్యవి తదారామమున కెంత భూషణప్రాయముగ నున్నను, నీరసముగనే యుండెను. ఏమన, మనోహర రూపవైభవ సముజ్జ్వల నారీజనులాసీనులగుట గూడియుండిరి. కొందఱు మోహనాంగు లొయ్యారముగ సోఫాలపై సుఖాసీనలై యుండిరి. కొందరు కోమలాంగులు జలస్తంభము జుట్టును మెఱుఁగుఁ దీగలవలె దిరుగాడుచుండిరి. అందఱును జవరాండ్రు; అద్భుత సౌందర్య విరాజితలు. పురుషు లరుదెంతురను భయంబెఱుంగక, ఆ మచ్చెకంటులు తమ మేలిముసుంగుల ద్రోసివైచి మేఘనిర్ముక్త పూర్ణసుధాకరబింబములవలె దీపించుచుండిరి. వారి యసాధారణ వేషము గాంచునంతనే, వారొక అమితాధికార ధనవంతుని యంతఃపుర కామినీ జనంబులు గావలయునని చెప్పక తెలియును.

అట్టి తావున ఖలీలుఁ డాకస్మికముగ దోఁచినంతనే, ఆ జవరాండ్రు సంభ్రమ పరవశలై నిజవదనాచ్ఛాదన మొనరించుట మఱచి నిమేషరహితను రాంగనలవోలె నతని వీక్షింపఁదొడంగిరి. కొంత తడవైన వెనుక తదుద్రేకము చల్లారినను, ఆ మోహనాంగులు తమ వీక్షణములు మఱలింపరైరి; సుందరాననంబులు మఱుగుపఱుపరైరి. ఏమన తురుష్కయువకుఁ డసామాన్య సౌందర్యవంతుఁడు గదా: తమ వదనము లట్టి నవమోహనాకారుని నయనములకు గనిపించుట వారి కెంతయు సహజామోదకరంబుగనే యుండెను.

వారిని గాంచినంతనే ఖాలీలుఁడు సహజముగ వెలిఁగంది, ఒక్క నిముసమట్లు నిలిచిపోయెను. అంతలో నొక తట్టు దట్టంపు పొదల చాటున నవ్వుడిలయెను. అతఁడు తోడనే తెలివొంది, నిజకరవాలము మెఱుపువలె మెఱయఁ మెఱుపువలెనే అదృశ్యుఁ డాయెను. భయసంభ్రమాకులంబున నా యంగనలు కెవ్వున నఱచిరి. సునిశితకృపాణము దాల్చిన ఆ వీరుఁ డట్లు వాయువేగమున బరుగిడుట చూడ, నెద్దియేని భయంకరకార్య మొండు దలపెట్టినట్లు స్పష్టమాయెను. వారి భయంబున కయ్యదె కారణము.

ఖలీలుఁ డెవ్వనినో వెన్నాడుచుండెనని పాఠకులు గ్రహించి యుందురు. చాపనిర్ముక్తబాణమువలె నాతఁడు పరుగిడుచుండెను. ఆ ప్రదేశము బాస్వరసు వంక వాలి యుండెను. ఖలీలుఁడు మస్రూ వెంటఁ బాఱుచుండెను. అతఁడు నౌకపై నిష్టజనపరివృతుఁడై విహారగింప నుండు సమయమున వాని భయంకరాకృతియే పొదల సందునఁ దోఁచెను. కావుననే, ఖాలీలుఁడా మధుపానీయము విసరివైచి తన మిత్రులఁజూడనైనఁజూడక వాయుగమనమున వెన్నాడఁ దొడంగెను.

మస్రూ బహుస్థూలకాయుఁడయ్యు నతి లాఘవముగఁ బరుగిడు చుండెను. కాని ఖలీలుడు శీఘ్రతరంబుగఁ బరుగిడుచుండెను. ఆవీరుని చరణములు భూమిపైఁ బడుట కానరాకుండెను, క్రమముగా నాతఁడు మస్రూను సమీపించుచుండెను. వారి నడుమనుండు దూరముక్షణ క్షణము క్షయమగుచుండెను. కాని, ఆ దురాత్ముఁడు బాస్వరసు వంకకే పోవుచుండెను. వాఁడు ఖలీలుని ఖడ్గధారకు జిక్కఁడేని ఆయ గాధజలంబులం బడును గాఁబోలు?

"ఓరీ దుష్టసేవకా! నిలు, నిలు! లేదేని, మదీయ కరవాలమునఁ దెగనఱికెద!"

ఖాలీలుఁడట్లు కఠినముగఁ బలికినను, వాఁడు సరకుసేయక పాఱి

వాఁడే నీరమునఁ దూఁకి యుండు గుభాలునఁ బడెను! ఇఁక ఖలీలుఁడేమి చేయవలయును? అతఁడు తోడనే నిలిచి, తానును జలంబులు జొచ్చి వానిని వెన్నాడవలయునని నిశ్చయించి, ఆయుధము బాఱవైచి, నీట మునిఁగిన సిద్దీ యెచట తేలునోయని అనిమిషనయనుఁడై వీక్షింపఁ దొడంగెను. కాని, క్షణములు నిముసములాయెను; నిముసము లొక్కొ-క్కటె గడచుచుండెను. సిద్దీ మాత్రము కానరాకుండెను—"సిద్దీ ఏమాయె? కలఁగిన జలములు తొంటి నిశ్చలత వహించెను! చాల నిమిషములాయెనే! కాదు—ఈదురాత్ముఁడు నీట మునుఁగు సమయమున తజ్జలాంతర శిలాఘటిత శిరస్కుఁడై మరణించియుండును: మునింగి, పైకెగయఁ జాలక చచ్చియుండును."

ఖాలీలుఁడట్లు చింతింపుచుఁ తదేకధ్యానమునఁ దీరమున నిలిచి యుండెను. అట్లు పది నిమిషములాయెను. సిద్దీ కానరాకుండెను. ఆ జలభాగమున నొక్క అలయైనను, మఱెట్టిచలనమైనను లేక నిశ్చలము గనే యుండెను. కాని వాఁడు సజీవుఁడై, జలములోని మృత్యువుతోఁ బోరాడుచుండెనని భావించుటకైనను అవకాశము లేకుండెను.

ఖాలీలుఁ డాకారణమున, పాఱవైచిన ఖడ్గము మగుడఁ జేఁబూని మెల్లగ నడువఁ దొడంగెను. అతఁడు మోమెత్తి చూచినంతనే ఆయుధపాణులగు నిరువదిమంది తనపై వడివడి నరుదెంచుట కాన్పించెను. ఒకఁడుదప్ప మిగిలిన వారందఱు సేవకులవలె దాసులవలె నుండిరి. ఆ పురుషుఁడు వారి ప్రభువు గావలయు. వాని సహజసుస్థిర గాంభీర్యమట్టులే యుండెను. వాని వదనము దుర్భరాగ్రహానలతప్తమై, అరుణమై, మఱి రక్తమై యుండెను. కారణమేమన, నిజకామినీ జన విహారారామము జొర సాహసించిన యువ పురుషుని భయంకరముగ శిక్షింపవలయునని యాతఁడు మత్సరక్రోధ ఘూర్ణితమానసుఁడై యురుదెంచుచుండెను.

ఐనను, ఖలీలుఁడు సహజ నిశ్చలగాంభీర్యధుర్యుఁడై వారిని జాయఁ బోయెను. ఖడ్గ మొరయందె యుండెను. వారలు సమీపింప, దౌర్జన్య నిరసన సూచకముగాఁ జేయెత్తి, నిశ్చలస్వరమున ఖలీలుఁడు నిస్పష్టముగ నిట్లనెను—"అనాలోచనముగా నపరాధ మొనరించి తిని—సమాధాన మొసంగెదను. నేను మాటాడు మహనీయు లెవ్వరో యెఱుంగఁ గోరెదను."

అట్లు పలుకు ఖలీలుని మేటిగాంభీర్యముఁ గాంచి, ఆప్రభువు చకితుడై నిలచిపోయెను. ఆతని యనుచరులుగూడ నట్లే నిలిచిరి. అతఁ డిట్లు పలికెను—

"నేను రాషిదాషాసని యెఱుంగుము. ఇఁక నీసమాధాన మేమి యో చెప్పుము—ఏమి చెప్పినను నిరర్థకమె..."

"ప్రభువరా! నీనామము సుప్రసిద్ధము. మేటి రాజనీతిజ్ఞుఁడ వనియు, దృఢతమస్వామిభక్తిపరాయణుఁడవనియు పేరొందియుం టివి. ప్రభూ! మానేర మల్లదె. మిత్రులతోఁ బాటు ఆస్థలమున నిలిచి పరస్పర సంభాషణం బొనరింపుచు విందు లారగింప నుంటిమి, ఆసమయమున, విడువడిన మష్టకంటకుఁ డాకస్మికముగ నాకంటఁ బడెను. తోడనే వానిని వెన్నాడఁ దొడంగి, ప్రమాదవశమున భవదీయ కాంతాజనంబులుండు తావుఁజొచ్చితిని. కాని, నేనందు నిలుచుటకు గాని వారి సౌందర్యము గాంచుటకుగాని అవకాశమే లేకపోయెను. ఆదురాత్ముని వెనువెంటనే రయమునఁ బాఱితిని. వాఁడా జలంబులఁ బడి మరణించెను.

"నీయుదంతము సత్యముకానోపు. నీవొక సిద్దీని వెన్నాడుట మేము కాంచియుంటిమి. ఐనను, నీయాగమనమంతే మాత్రమున సమంజసము కానేరదు. యువకుఁడా! నీవెవరవు? పాషా యట్లుపలుక, ఖలీలుఁ డిట్లనెను—

